# ఆంధ్రపత్రిక

సంవత్సరచందా
రు. 12-0-0
విడిప్రతిక
4 అణాలు

ప్రతిబుధవారము ప్రకటింపబడును.

ఒరులేయవి యొనరించిన నరవర! యప్రియము తనమనంబున కగు దా
నొరులకు నవి సేయకునికి పరాయణము పరమధర్మపథముల కెల్లన్.
(మహాభారతము)

**Founder : K. NAGESWARA RAO.**

సంపుటము **42**
సంచిక **28**

విరోధి సంవత్సర ఫాల్గున బహుళ ద్వాదశి బుధవారము




అంబాలాలోని సిక్కు సైనికకేంద్రంలో మార్చి 1, 2వ తేదీల ఉత్సవంలో విక్టోరియా పతక బహూకృతిని పొందిన కెప్టెన్ ఇషార్ సింగ్, కెప్టెన్ ప్రకాశ్ సింగ్, హవల్దార్ జ్ఞాన్ సింగ్, పరమవీరచక్ర పతకాన్ని పొందిన లాన్స్ నాయక్ కరమ్‌సింగ్ గార్లను ఊరేగిస్తున్న దృశ్యం. కరమ్‌సింగ్ గారు పూలమాలాలంకృతులై నిలిచి ఉన్నారు.




# ఆంధ్రపత్రిక

1950-వ సం॥ మార్చినెల 15-వ తేది బుధవారము


## పాకిస్తాన్ 'నాజీ' విధానం

ద్వితీయ ప్రపంచసంగ్రామఫలితముగ నామరూపములు లేకుండ పోయిన నాజీజర్మనీ, ఫాసిస్టు ఇటలీ విధానమునే పాకిస్తాన్ అవలంబించుచున్నదని తూర్పు బెంగాల్‌సంఘనలు ధ్రువపరచినవి. అభూత కల్పనలుచేసి వాటిని నిత్యసత్యములుగ ప్రచారముచేసి తమ విధానమును సమర్థించుకొనుటకు తమ చర్యలను కప్పిపుచ్చుకొనుటకు హిట్లర్, ముస్సొలోనీల ప్రభుత్వములు ప్రయత్నించినట్లే నేడు లియాకత్ ఆలీఖాన్ ప్రభుత్వము ప్రయత్నించుచున్నది. జర్మనీలోని యూదులను నానాహింసలుపెట్టి, దేశబహిష్కృతుల జేసి, వారి సర్వస్వమును నాజీజర్మనీ స్వాధీనము చేసుకొనెను. పాకిస్తాన్‌లోని హిందువులను కరాచీప్రభుత్వము ఇదేవిధముగ చూచుచున్నది. ఇక భారతదేశమునందున్న ముస్లిముల విషయమై పాకిస్తాన్ అనుసరించుచున్న విధానము సుడేటన్ జర్మనుల రక్షణ పేరిట చకస్లొవేకియావిషయములో హిట్లర్ అనుసరించిన విధానమును జ్ఞాపకము చేయుచున్నది. హిట్లర్ ఆస్ట్రియాను ఆక్రమించినట్లే పాకిస్తాన్ కాశ్మీరును ఆక్రమింప దలచెను.

పాకిస్తాన్ తన కళ్ళ ఎదుట జరిగిన ఈ సంఘటనలనుండి పాఠము నేర్చుకొని నాజీ, ఫాసిస్టువిధానములకు భవిష్యత్తు శూన్యమని, అట్టి విధానములు ఆత్మవినాశనకరమని గ్రహింపవలసియుండును. పాకిస్తాన్ భారతదేశమునందలి ముస్లిముల విషయమై పత్రికల ద్వారాను, రేడియోలద్వారాను చేయుచున్న విషప్రచారమును ఖండించుచు, అట్టి ప్రచారమును అరికట్టవలసిన దని భారతప్రభుత్వము ఎన్నో పర్యాయములు పాకిస్తాన్‌అధికారులను హెచ్చరించియుండెను. భారతప్రభుత్వవిజ్ఞాపనములు, హెచ్చరికలు అన్నియు చెవిటివాని ముందు శంఖూదినట్లయ్యెను. కలకత్తా సంఘటనలలో గాయపడిన, మరణించిన ముస్లింల సంఖ్య నూరుమాత్రమే యుండ పాకిస్తాన్‌పత్రికలు, రేడియో "ముస్లింలు శతసహస్రముగ హత్యచేయబడిరి" అని ప్రకటించెను. కలకత్తా వెళ్లి స్వయముగ పరిస్థితులను చూచివచ్చిన పాకిస్తాన్‌హైకమిషనర్ అయినను యథార్థపరిస్థితులను తెలిపి ఇట్టి అసత్యప్రచారమును అరికట్టవలసియుండెను. వా రట్టిపని చేయకుండుటయు, పాకిస్తాన్‌అధికారులు గత నాలుగైదుమాసములుగ పనిగట్టుకొని ఇట్టి అభూతకల్పనలను ప్రచారము చేయుచుండుటనుబట్టి భారతదేశముతో సంఘర్షణకు పాకిస్తాన్ తలపడుచున్నట్లు భావింపవలసియున్నది.

అదే సంభవమైన పాకిస్తాన్‌లో ఒక్క హిందువు ఉండుటకైనను సాధ్యము గాదు. ఇప్పటికే పాకిస్తాన్‌లోని హిందువులస్థితి దుర్భరముగ నున్నది. వారు ఇళ్లు వాకిళ్లను, తమ సర్వస్వమును కోల్పోయి బికారులై భారతదేశమును చేరుచుండిరి. ఇందువలన భారతదేశ ఆర్థికస్థితి అధ్వాన్నమగుచున్నది. భారతదేశముపై సైనికచర్యలు సాగింప సంకల్పించిన పాకిస్తాన్ వాంఛించున దిదియే.

ఈవిధముగ పాకిస్తాన్ భారతదేశమును ఇరుకున పెట్టి కాశ్మీరును పాకిస్తాన్‌అంతర్భాగముగ చేసుకొన దలచుచున్న దనుట నిస్సందేహము. ఆ ప్రమాదమును నివారించుటకు తూర్పుబెంగాల్‌హిందువుల సమస్య తృప్తికరముగ పరిష్కారము కావలెను. ఆ పరిష్కారమునకే ప్రజలు, ప్రభుత్వము కృషిచేయవలసియున్నది.

# 'లాయక్ అలీ పలాయనం'

గృహనిర్బంధములో నున్న హైదరాబాద్ మాజీ ప్రధాని మీర్ లాయక్ ఆలీ తప్పించుకుపారిపోయినందుకు తమ బాధ్యత ఏమీ లేదని రిపబ్లిక్ హోం శాఖామంత్రి సర్దార్ వల్లభాయ్ పటేల్ పార్లమెంట్ లో ఇచ్చిన సమాధానము ఎవరికి తృప్తికరముగ నుండదు. చట్టరీత్యా హైద్రాబాద్ లో శాంతి, భద్రతల రక్షణకు వెల్లోడిమంత్రివర్గమువారిదే బాధ్యత కావచ్చును. కాని మిలిటరీగవర్నరును తొలగించి వెల్లోడిని ప్రధానమంత్రిగ నియమించినది రిపబ్లిక్ సంస్థానశాఖ అయినపుడు, వెల్లోడిప్రభుత్వఅసమర్థతకు, ఆ ప్రభుత్వముచేయు తెలివితక్కువపనులకు సంస్థానశాఖ బాధ్యత వహించక తప్పదు. లాయక్ ఆలీ పోలీసుకాపలానుండి తప్పించుకుపోయినతరువాత దాదాపు 24 గంటలకుగాని అధికారులకు వర్తమానము తెలియలేదన్న సంస్థానపరిపాలన ఎంత అసమర్థముగ జరుగుచున్నది స్పష్టమగును. పారిపోయినపిదప ఎంత తీవ్రఅన్వేషణ జరిపినను, ఇతరులపై ఎట్టి కఠిన చర్యలు అమలుజరిపినను, మొదటి లోపమును సరిచేయుటగాని, జరిగిన తప్పును దిద్దుకొనుటగాని జరుగదు. పోలీసుచర్య పూర్తియై ఏడ్నర్థమైనది. లాయక్ ఆలీమంత్రివర్గముపై నేరారోపణ చేయుట కవసరమైన వివరముల సేకరణ దాదాపు అప్పట్నుండియు జరుగుచున్నది. విచారణ దాదాపు పూర్తియైనదనియు త్వరలోనే కేసు బనాయించుట జరుగుననియు మిలిటరీగవర్నరుపదవినుండి విరమించుటకు ముందు మేజర్ జనరల్ చౌదరి అనేకపర్యాయములు ప్రకటించెను. కాని ఈనాటివరకు ఏమియు జరుగలేదు.

నేడు హైదరాబాద్ సంస్థానమునందు పరిస్థితులు ఎట్లున్నవో గ్రహించుటకు లాయక్ ఆలీసంఘటన తోడ్పడును. భారతప్రభుత్వమునకు ఇతర విషయములలోవలెనే హైద్రాబాద్ విషయమునను ఒక ఖచ్చితమైన విధానము లేకపోవుటే ఇందుకు కారణము. నైజాంభవిష్యత్తునుగురించిగాని, సంస్థాన విభజననుగురించిగాని, రాజాకార్ నాయకుల విచారణ, లాయక్ ఆలీమంత్రులపై నేరారోపణవిషయములోగాని కేంద్రప్రభుత్వానికి ఒక నిర్దుష్టమైన విధానం లేదు. పోలీసుచర్యకుముందు సంస్థానమున జరిగిన దురంతాలన్నింటికి లాయక్ ఆలీప్రభుత్వము ప్రోత్సాహం ఇచ్చిందనీ, అనేకమంది అమాయకుల హత్యలకు ఈ లాయక్ ఆలీమంత్రివర్గం కారణభూతమైందనీ కేంద్రప్రభుత్వం ఆరోపించియుండెను. అట్టి కిరాతక చర్యలకు బాధ్యులైనవారికి గృహనిర్బంధమును ఏర్పాటుచేయుటలో ఆంతర్య మేమి? అధికారవర్గములు వీరియెడల ఇంత కారుణ్యమును చూపవలసిన అగత్యమేమి?

నాజీయుద్ధఖైదీలతో సమమగు "మర్యాదలకు" తగినవారి నీవిధముగ కరుణించుటవలననే లాయక్ ఆలీ తప్పించుకుపోవుటకు వీలైనది. ఇంతకుపూర్వ మొక వదంతి ప్రచారమయ్యెను. లాయక్ ఆలీ మంత్రివర్గమునకు చెందిన పింగలి వెంకట్రామా రెడ్డిగారు తూర్పుపాకిస్తాన్ వెళ్లిరని, అచటినుండి రేడియోలో భారత దేశముపై దుష్ప్రచారం చేయుచుండిరని పాకిస్తాన్ పత్రికలు ప్రకటించెను. అది అసత్యమని వెంకట్రామా రెడ్డిగారు ఇంకను నిర్బంధమునం దుండిరని ప్రకటించుటతో అధికారులు తృప్తిచెందిరిగాని జరుగబోవు సంఘటనల కిది సూచన యని గ్రహించియుండలేదు.

ఈ సంఘటనకు కేవలము కాపలావారిని దండించి ప్రయోజనము లేదు. పై వున్నతాధికారులే ఈ సంఘటనకు పూర్తి బాధ్యత వహింపవలసియుండును. వెనుక రజాకార్ల హయాములో అధికారము చేసినవారే నేడు సంస్థానవ్యవహారములను సాగించుచున్నారని ప్రభుత్వమున వారిమాటకే విలువగలదని ఇటీవల జరిగిన ప్రచారము సహేతుక మని ఈ సంఘటన ధ్రువపరచుచున్నది. సంస్థానపరిపాలనాయంత్రము నంతను సంస్కరింపవలసియున్నదని "లాయక్ ఆలీపలాయనము" హెచ్చరించుచున్నది.

నేటి ప్రపంచం:

# శాంతిసాధన సూచనలు: రష్యా అమెరికాల వైఖరి

## తూర్పు జర్మనీలో ఎన్నికలు

ప్రపంచశాంతిసాధనకోసం రష్యా అమెరికాలమధ్య వైషమ్యాల నివారణకోసం యత్నాలు ఇంకా జరుగుతూనే ఉన్నాయి. అమెరికన్ ప్రభుత్వంపైన అమెరికన్ నాయకులు కొందరు ఒత్తిడి తెచ్చారు. కాని ట్రూమన్ ఒత్తిడికి లొంగబోవడం లేదని ఖండితంగా చెప్పాడు. అగ్రనాయకుల సమావేశం జరగవలసె ఉంటే అది వాషింగ్టన్‌లోనే జరిగితీరాలనీ తాను మాస్కో వెళ్లడం అసంభవమనీ ట్రూమన్ చెప్పాడు. స్టాలిన్ వాషింగ్టన్ వస్తే ఆదరించగలడన్నాడు.

మాస్కోలో 12 వ తేదీ ఆదివారం నాడు జరుగుతున్న ఎన్నికల్ని పురస్కరించుకుని ఎన్నికల ప్రచారంసందర్భంలో ప్రముఖరష్యన్ నాయకులు శాంతిసమాలోచనలకు రష్యా సంసిద్ధంగా ఉన్నట్లు ప్రకటించారు. ఇలా ప్రకటించినవారిలో రష్యన్ పాలిట్ బ్యూరోసభ్యులైన మెలంకోవ్, వోర్షిలోవ్, బెరియా, మోలటోవ్‌లు ముఖ్యులు.

అయితే వారిప్రకటనలు అమెరికన్లకి సంతృప్తికలిగించలేదు: వారు ఒక చెంప శాంతిసాధనకే రష్యా కృషిచేస్తున్నదని ప్రచారంచేస్తూ మరొక చెంప ఆంగ్లో-అమెరికన్ ప్రభుత్వనాయకుల్ని నిందిస్తున్నారు. హైడ్రోజన్‌బాంబు నిర్మిస్తున్నట్లు అమెరికన్ ప్రభుత్వంచేసిన ప్రకటన కేవలం బెదరింపుమాత్రమే నని హైడ్రోజన్ బాంబుల్ని వారు నిర్మించలేరనీ మోలటోవ్ అన్నాడు. ఆంగ్లో-అమెరికన్ వర్గ రాజ్యాలలో ప్రజలు వారి ప్రభుత్వాల యుద్ధప్రచారంపట్ల విముఖులుగా ఉన్నారనీ, ఆ ప్రజలే రష్యా శాంతియత్నాలకు తోడ్పడగలరనీ రష్యన్ నాయకులంటున్నారు. ప్రజలు అంటే కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన్ని అంగీకరించేవారని వారి అర్థం చెప్తున్నారు.

రష్యాతో సమాధానంకోసం యత్నించాలని చెప్పే ఆంగ్లో-అమెరికన్ దేశాలనాయకులు ముఖ్యంగా హైడ్రోజన్ బాంబు, విషక్రిములతో తయారుచేయబడే ఆయుధపరికరాలను తయారు కాకుండా చెయ్యాలని ఉద్దేశిస్తున్నారు. ఏటం కంట్రోల్ విషయమై ఐక్యరాజ్యసమితి ద్వారా సమాధానానికి ఎవరు కృషిచేసినా, అమెరికాసంసిద్ధమేనని అమెరికన్ విదేశాంగ మంత్రి ప్రకటించాడు.

రష్యా-అమెరికాల మధ్య సమాధానం కుదరవలసిన సమస్యలు చాలా ఉన్నాయి. వానిలో ముఖ్యమైనవి: ఏటంకంట్రోల్, జర్మనీ, జపాన్ ఆస్ట్రియా, మొదలైన దేశాలతో శాంతి ఒడంబడికలు, ఐక్యరాజ్యసమితిలో కమ్యూనిస్టుచీనాసభ్యత్వం. వీనిలో ఏటంకంట్రోల్, ఆయుధ నిర్బంధాల సమస్య, కమ్యూనిస్టుచీనాలగురించి సమాధానం కుదిరితే మిగిలిన సమస్యల్ని సులువుగా పరిష్కరించవచ్చును. అంటే ఈ సమస్యలు ఐక్యరాజ్యసమితిద్వారానే పరిష్కారం కావాలి. ఐక్యరాజ్యసమితిలో చీనాసభ్యత్వవిషయం తేలేవరకూ రష్యా ఐక్యరాజ్యసమితి కార్యక్రమంలో పాల్గొనదని రూఢిఅయింది.

చీనాసభ్యత్వసమస్యపట్ల అమెరికన్ ప్రభుత్వం తన వైఖరిని క్రమంగా మార్చుకోగలదని న్యూయార్క్ టైమ్స్‌పత్రిక వ్రాస్తున్నది.

చీనాసభ్యత్వ సమస్య భద్రతామండలిలో చర్చకు వచ్చినప్పుడు ప్రాతినిధ్య నియమాల లోపాలున్నవనీ, వానిని సంస్కరించాలనీ భారతప్రభుత్వ ప్రతినిధి సూచించాడు. ఆయాదేశాల ప్రతినిధులకు ప్రాతినిధ్యాధికారాన్ని ఆదేశాల ప్రధానులు లేదా విదేశాంగమంత్రులు పత్రరూపంలో ఇవ్వాలని సూచిస్తూ ఒక సవరణ, చీనా ప్రాతినిధ్యంగురించి ఐక్యరాజ్యసమితిలో దేశాల ప్రభుత్వాలన్నిటి అభిప్రాయం తెలుసుకుని తత్ప్రకారం నిర్ణయించాలని ఒక సూచన సర్ బి. యన్. రావుగారు ప్రవేశపెట్టారు.

కాని రష్యా తన తీర్మానాన్ని అంగీకరించాలని పట్టుబట్టింది. ఆ తీర్మానంలో చీనాకమ్యూనిస్టుప్రభుత్వ ప్రతినిధిని ప్రవేశపెట్టాలనీ, అభ్యుదయనిరోధకులైన" జాతీయప్రభుత్వప్రతినిధుల్ని వెళ్లగొట్టాలనీ తీర్మానం పెట్టింది. కాని తీర్మానాన్ని భద్రతామండలి నిరాకరించింది. అంతతో రష్యన్ ప్రతినిధులు భద్రతామండలినుంచీ ఐక్యరాజ్యసమితికి చెందిన తదితరసంఘాల నుంచీ నిష్క్రమించారు.

తరువాత భద్రతామండలి నియమించిన ఒక కమిటీ భారతదేశప్రతినిధిసవరణలను పరిశీలించి మొదటి సూచనను అంగీకరించింది. రెండోసూచనను సమితిసర్వసభ్య సమావేశంవరకూ వాయిదా వేసింది.

మొదటిసూచనను అంగీకరించినందువల్ల చీనాకమ్యూనిస్టప్రభుత్వప్రవేశానికి అవకాశం ఏర్పడుతుందని కొందరన్నారు. కాని ఈసవరణఫలితంగా కమ్యూనిస్టప్రభుత్వప్రతినిధిప్రవేశసమస్య కేవలం నియమాలకు సంబంధించిన మార్పనా లేక సమితి చర్చించవలసిన ముఖ్యమైన మార్పా అనే వివాదం వచ్చింది. కేవలం నియమాలకు సంబంధించిన మార్పే అయితే అది భద్రతామండలిలో చర్చకువచ్చినప్పుడు అమెరికా చీనాలు వీటో అధికారాన్ని ప్రయోగించడానికి వీలుండదు. రెండో పక్షమైతే వీటో ప్రయోగించే హక్కు ఉంటుంది. మొదటిపక్షమయితే మండలి ఏడుగురి ప్రతినిధుల ఓట్లుకూడా సుముఖంగా రావాలి. అప్పుడే కమ్యూనిస్టుచీనాకు సమితిలో ప్రవేశం కలుగుతుంది.

ఇంక ఈ సమస్య చర్చకు రాగలప్పుడు

(39 వ పేజీ చూడుడు)

# పశ్చిమయూరప్‌లో వ్యాపార నిర్బంధాలు

**[ విలియమ్ హార్డ్ ఆండ్రీ విసన్. ]**

పశ్చిమయూరప్ అమెరికాకు ఇచ్చిన వాగ్దానాన్ని భగ్నపరుస్తోంది. మార్షల్ సహాయం పొందుతున్న దేశాలు కేవలం అమెరికన్ ధనంవల్లనే తమదేశాల ఆర్థికస్థితి చక్కబడదని మొదటినుంచీ అంగీకరించిన మాటే. ఆ దేశాలన్నీ కలిసి సహకార బుద్ధితో కృషి చేసినప్పుడే ఆర్థికస్థితి చక్కబడుతుంది. ఆరీతిగా సహకరించగలరని అమెరికన్లకి మాట ఇచ్చారు. కానివారిప్పుడేం చేస్తున్నారు? ఆర్థికరంగంలో తీరని అపకారం కలగచేస్తుంటున్నారు. ఆర్థికంగా నిత్యమూ అంతర్యుద్ధంలో మునిగిఉండే ప్రాంతానికి ప్రతిఏటా కోట్లాది డాలర్ల ధనం ధారపోస్తూ అమెరికా మాట్లాడకుండా ఊరుకోకూడదు.

బ్రిటిష్‌వారి బొగ్గుఎగుమతుల్నే మచ్చుకి చూద్దాం. యూరప్‌కి బ్రిటిష్‌వారి బొగ్గు అవసరం. కాని బ్రిటిష్‌ప్రభుత్వం తమ పారిశ్రామికులికి బొగ్గును సులువుగా లభింపచెయ్యాలంటుంది. అందువల్ల బొగ్గుకి రెండు ధరలు నిర్ణయించింది, బ్రిటన్‌లోనే పారిశ్రామికులికి అమ్మకపు ధర టన్ను మూడు పౌనులు. యూరప్‌లో అమ్మకపు ధర నాలుగుపౌనులు.

అంటే బ్రిటిష్ పారిశ్రామికులికి బొగ్గు చవుకగా లభిస్తుంది. యూరప్‌లో దిగుమతిదార్లు ఎక్కువ ధర చెల్లించవలసి వస్తోంది. ఇది యూరోపియన్లకి ఇష్టం లేదు. వారు బ్రిటిష్‌ప్రభుత్వవిధానాన్ని విమర్శిస్తున్నారు. విమర్శిస్తున్నారే కాని వారూ అదే పనిచేస్తున్నారు మచ్చుకి ఫ్రెంచివారి ముడిఇనుము సంగతిచూద్దాం. ఫ్రెంచివారు కొంటే ధర టన్నుకి 585 ఫ్రాంకులు. మిగతా దేశస్థులు కొంటే టన్నుధర 1080 ఫ్రాంకులు.

ఈ పద్ధతులవల్ల పశ్చిమయూరప్‌లో ప్రతిదేశం మిగతాదేశాల్ని నష్టపరిచి తమ దేశానికి లాభాలు తెచ్చుకోవాలని ప్రయత్నిస్తోంది.

రెండేసి దేశాలమధ్య బేరాలు వాణిజ్యపు ఒడంబడికలూ గమనిద్దాం. ఒక దేశానికి గోధుమలు బంగాళాలు దుంపలు కొనుక్కోవలసిన అవసరం ఉంటుంది.

అవి మరొకదేశంనుంచి కొనుక్కోవాలి. మునపటిరోజుల్లో అయితే మొదటి దేశంలోని వర్తకులు స్వేచ్ఛగా రెండో దేశం వెళ్లి కావలసినంత సరుకు కొని తెచ్చుకునేవారు. కాని సులభంగా నడిచిపోయే ఆ వ్యాపారాన్ని తీరూ తెన్నూ లేనిదని ఇప్పుడంటారు. ఇప్పుడన్నీ ఒక కార్యక్రమం ప్రకారం నడవాలిట. ఇప్పుడు మనకి కంట్రోల్స్ ఉన్నాయి. కాబట్టి మొదటిదేశంనించి ఆర్థికరాయబారులు పనిగట్టుకుని రెండోదేశానికి యాత్ర వెడతారు. రెండోదేశంలో పెద్దహోటల్లో దిగుతారు. మాసాలకొద్దీ ఆ దేశపు ప్రభుత్వంతో మంతనాలు నడుపుతారు. "మాకు గోధుమలు బంగాళాదుంపలు కావాలి"అంటూ వాదిస్తారు, రెండోదేశపు ప్రభుత్వప్రతినిధులు "మీరు గోధుమ బంగాళాదుంపలు కొనవచ్చునుకాని మా ఓట్లు ఉలవలూ కూడా మీరు కొంటేనే అది వీలవుతుంది" అంటారు. "కాని మాకు ఓట్లు ఉలవలూ అక్కర్లేదు" అంటారు మొదటిదేశపు రాయబారులు. "అలాగయితే మా గోధుమ బంగాళాదుంపలూ కూడా మీకు రావు" అంటారు రెండోదేశపు ప్రతినిధులు.

చిట్టచివరికి మొదటిదేశపు ప్రతినిధులు ఒప్పుకోక తప్పదు. కావలసిన గోధుమలు బంగాళాదుంపలూ కొనుక్కోడానికి అక్కర్లేని ఓట్లు ఉలవలూ కూడా కొనడానికి ఒప్పుకుంటారు. రెండోదేశం ఇటలీ అనుకోండి. ఇటలీప్రభుత్వంతో రాయబారాలు జరిపిన దేశం అక్కర్లేకపోయినా నిమ్మకాయలు కొనితీరవలసిందే.

దీన్ని పరస్పరసహాయం సహకారం అనలేం. ఇది ఒడంబడికల ద్వారా జరిగే దోపిడీ అనాలి. ఒక వర్తకపుటొడంబడికలో ఒక్కొక్కవస్తువును చేర్చకపోతే అసలే వస్తువుల్నీ దిగుమతిచేసుకోమని కొన్ని దేశాలంటాయి.

పారిస్‌నుంచి బ్రసెల్స్‌కి వెడుతున్నామనుకోండి. రైలు ఇంకా సరిహద్దు దాటకముందు ఒక స్టేషన్‌లో ఆగుతుంది. బెల్జియన్ పానీయం కొనుక్కోవాలనుకుంటారు. సోడాలవాడొస్తాడు. తనదగ్గిర యిటువంటిది లేవని నిష్కర్షగా చెప్తాడు. "సరిహద్దు దాటినతర్వాత అక్కడ కొనుక్కోండి. ఇక్కడ కావలసిస్తే ఫ్రెంచి వింటో ఇస్తాను. కావాలా! మళ్లీ సరిహద్దు దాటినతరవాత ఈ వింటో కావాలన్నా దొరకదు" అంటాడు.

పశ్చిమయూరప్‌లో కాని అన్నిటికంటె అతికఠినమైన నిర్బంధం ద్రవ్యమారకంపైన ఉంటుంది. రైలు సరిగా ఫ్రాన్సు, బెల్జియంల మధ్య సరిహద్దుకి చేరగానే ఫ్రెంచి అధికారులు రైలెక్కుతారు. దగ్గర పర్సులో 50,000 ఫ్రాంకు లున్నాయనుకుందాం. (దాదాపు 500 రూపాయలు) అందులో 40 వేల ఫ్రాంకులు లాక్కుంటారు. మళ్లీ తిరిగి ఫ్రాన్సు వచ్చినప్పుడు ఆ 40 వేల ఫ్రాంకులూ ఇచ్చేస్తారు. అది కూడా పదిసార్లు ఫ్రెంచి ద్రవ్యమారక కార్యాలయం చుట్టూ తిరిగిన తరవాతనే.

నిజానికి ఈ ద్రవ్యమారకాన్ని అన్ని దేశాలకంటే బ్రిటిష్ దేశమే మరీ కఠినంగా నిర్బంధించింది. బ్రిటన్‌నుంచి యూరప్‌ఖండాని వెళ్లే స్త్రీలను కూడా బంగారునగల్ని వీసమైనా తీసుకపోనివ్వరు. బ్రిటిష్‌స్టాంపుల్ని కూడా తీసుకుపోనివ్వరు.

ఇటువంటి కఠిననిర్బంధాల్ని అమలు జరపడానికి శాంతికాలంలో ఇంతకుపూర్వం ఏ ప్రభుత్వమూ బ్రిటన్‌లో తీసుకోజాలని చర్యల్ని ఇప్పుడు తీసుకుంటున్నారు. బ్రిటిష్‌పౌరుల రహస్యలేఖల్ని కూడా విప్పి పరిశీలిస్తారు. ఇది వ్యక్తిగతస్వాతంత్ర్యానికి ప్రపంచంలో గర్వించే దేశస్థులే చేస్తున్నారు. నిర్బంధాలు, కంట్రోల్సు ఎటువంటి ప్రభుత్వాన్నైనా అంతటి నీచాలకి దింపుతాయి.

ఈ జాతీయపరిమితవ్యాపారనిర్బంధాలు, ద్రవ్యమారకనిషేధాలూ అంతర్జాతీయసహకారవిధానానికి విరుద్ధాలు. యూరప్‌లో సోషలిజం అంతర్జాతీయ సౌభ్రాతృత్వానికి దారితియ్యగలదని మొదట

అనుకున్నారు. కాని క్రియలో పశ్చిమ యూరప్‌లో సోషలిజం ఎన్నడూ కనీ వినీ ఎరుగని సంకుచితతత్వాలు, స్వార్థజాతీయ వాదాలు సంభవించాయి.

బ్రిటిష్ ద్రవ్యం (పౌను) మారకపు విలువ తగ్గింపుసంగతి చూద్దాం. పారిస్‌లో యూరోపియన్ ఆర్థిక సహకార సంస్థ (ఆర్గనైజేషన్ ఫర్ యూరోపియన్ ఎకనమిక్ కో ఆపరేషన్) ఒకటి ఉంది. ఈ సంస్థలో బ్రిటన్‌కి కూడా సభ్యత్వం ఉంది. కాని బ్రిటిష్ పౌను విలువని 4.03 డాలర్ల నుంచి 2.80 డాలర్లకి తరిగించినప్పుడు బ్రిటిష్ ఆర్థికమంత్రి సర్ స్టాఫర్డ్ క్రిప్స్ పశ్చిమ యూరప్‌లోని ఆ దేశాల ఆర్థికమంత్రుల్తో సంప్రదించనైనా లేదు. అకస్మాత్తుగా ఎవరికీ తెలియకుండా పౌను మారకం విలువని తగ్గించినందువల్ల పశ్చిమయూరప్ అంతా చలించిపోయింది. ఒక్క స్విట్జర్లండ్‌లో తప్ప మిగతా పశ్చిమయూరోపియన్ దేశాలన్నిటిలోనూ ద్రవ్యాల మారకపు విలువలు పడిపోయాయి.

బ్రిటన్ చేసిన ఈ చర్యను "ఆర్థిక సమరం" అన్నాడు ఫ్రెంచి ఆర్థికమంత్రి. కాని నిజానికి పశ్చిమయూరప్‌లో నిత్యమూ జరుగుతున్న ఆర్థికసమరంలో ఇదొక ముఖ్యఘట్టం మాత్రమే. దీని ఫలితాల్ని పైన పేర్కొనబడిన సంస్థ నివేదించింది. ఈ నివేదికనిబట్టి పశ్చిమయూరప్ పరిస్థితీ, అమెరికా పరిస్థితీ తెల్లమౌతాయి.

నివేదికలో ఈ క్రింది విషయం చెప్పబడింది :

పాల్ హాఫ్‌మన్ ఆధ్వర్యంకింద పశ్చిమ యూరప్‌కి పంచబడిన 800 కోట్ల డాలర్ల అమెరికన్ సహాయంవల్లనూ పశ్చిమ యూరప్‌లో వస్తూత్పత్తి చాలా వృద్ధి చెందింది. పశ్చిమయూరప్ ఆర్థికస్థితికి స్థైర్యం చిక్కింది. కాని ఇంతలోనే పశ్చిమ యూరప్ మళ్లీ వెనకదారి పట్టింది. ఇప్పుడేదో ఒకటి జరిగితే కాని పాల్ హాఫ్‌మన్ శ్రమంతా 800 కోట్ల అమెరికన్ డాలర్లతో సహా వ్యర్థం కాకతప్పదు.

ఇప్పుడేదో ఒకటి జరిగితేకాని అంటే ఏం జరగాలి? అలా జరగడానికి అమెరికన్లు ఏం చెయ్యాలి?

చాలామంది చెప్తారు. "అదేముంది! చాలా సులువే! యూరోపియన్ యునైటెడ్‌స్టేట్స్‌నీ స్థాపిస్తేసరి. అన్నిదేశాల్నీ ఒక్క నిర్వహణాధికారంకిందికి తెస్తే సమస్య తేలిపోతుంది." కాని అది తక్షణ కర్తవ్యానికి సంబంధించినది కాదు. యూరోపియన్ యునైటెడ్‌స్టేట్స్ స్థాపన ఇప్పట్లో సాధ్యపడేది కాదు. అంతవరకూ అక్కర లేదు. అంతకంటె చిన్నకార్యాల్లోనే ఏమి జరిగింది?

నాలుగేళ్లుగా బెల్జియం, లగ్జెంబర్గ్, హాలండ్ దేశాలమధ్య ఆర్థికసమ్మేళనంకోసం రాయబారాలు నడుస్తున్నాయి. అదింకా పరిష్కారానికి చాలా దూరంలో ఉంది. ఎప్పటికప్పుడు ఏవో చిక్కులవల్ల కుదరకుండా వాయిదా పడిపోతోంది.

ఇంకోటి చూద్దాం. 1948లో ఫ్రాన్సు, ఇటలీదేశాల విదేశాంగమంత్రులు సమావేశమై ఉభయదేశాలమధ్యనూ రవానాసుంకాల్ని రద్దుపరచడానికి ప్రయత్నాలు చేశారు. ఈ రద్దు 1949 లో అమలుజరగాలని వారి ఉద్దేశం. కాని ద్రాక్షసారాయాన్ని ఇటలీనుంచి కొనడం ఫ్రాన్సుకి ఇష్టం లేకపోయింది. ఆల్జీరియానుంచే కొనుక్కోవాలని వారి కోరిక. ఫ్రెంచిమోటార్లు వచ్చి ఇటాలియన్ మోటార్ల పరిశ్రమతో పోటీచేసి పడగొడతాయేమో నని ఇటాలియన్లు భయపడ్డారు. కాబట్టి అనుకున్న రవానాసుంకాల రద్దు అమలు జరగనే లేదు.

డెన్మార్క్, స్వీడన్, నార్వేలమధ్య కూడా ఇదే జరిగింది. ఆదేశాలమధ్య కూడా రవానాసుంకాల రద్దుకి సమాధానం కుదరలేదు.

వీనివల్ల ఒకటి ధ్రువపడుతున్నది. యూరోపియన్ యునైటెడ్‌స్టేట్స్ స్థాపనవరకూ అక్కర్లేదు. కాని రవానాసుంకాల రద్దుకూడా పశ్చిమయూరప్‌లో ఇప్పుడు సాధ్యపడవు. ఇంకేమి చెయ్యాలి? తక్షణం సాధించగలవేవో తేల్చుకోడానికి యూరోపియన్లు, అమెరికన్లు సంప్రతించుకోవాలి. ముఖ్యంగా యూరప్‌లో పన్నుల విధింపుపద్ధతినిగురించి చర్చించాలి.

బ్రిటన్‌లో పన్నులు చాలా అధికం. నిజమే. కాని మరోకవంక చూస్తే ఫ్రాన్సు పరిస్థితి విపరీతంగా ఉంది. రవానాసుంకాలవిధింపువల్ల నిలబడగలిగిన ఫ్రెంచి మోటారుపరిశ్రమల్లో తయారైనవి పదివేల డాలర్లకంటె అధికధరలకి ఒకొక్క మోటారు చొ॥ అమ్ముతున్నాయి. రాత్రి భోజనాలకీ, విందులికీ వెళ్లాలంటే తలకి 30 డాలర్లు, 75 డాలర్ల వరకూ ఖర్చవుతుంది. వేలాదిగా ప్రజలు రాత్రివేళ నృత్యగాన శృంగారాదివిలాసాల్లో పడిఉంటారు. ఖర్చులు మిన్నుముట్టుతున్నాయి. ధనం నీళ్లవలె వెచ్చించబడుతోంది. లక్షలాది ప్రజలు సాలుకి 3600 డాలర్లైనా ఖర్చుపెడుతున్నారు. కాని ప్రభుత్వపు లెక్కల ప్రకారం సాలుకి 3600 డాలర్లు ఆదాయం కలవారు ఫ్రాన్సులో 2,531 మందే ఉండాలి! ఇంతటి మోసం, ధనార్జనదాపరికం, పన్నుల ఎగవేత, పాలకుల అసమర్థత ఎక్కడా చూడబోము. రాబడిపన్ను ఎగవేస్తే ఫ్రాన్సులో నేరంకిందికి జమరాదు. మరేదేశంలోనైనా తలకి మించిన జరిమానాలు, కారాగారవాసాలు విధించబడతాయి. ఫ్రాన్సులో నిక్షేపంగా పన్ను ఎగవెయ్యవచ్చును.

అమెరికాలో ప్రభుత్వం ఆదాయం కంటె ఖర్చు అధికం చేస్తోంది. సాలుకి 500 కోట్ల డాలర్లు ప్రజలవద్దనుంచి ఋణం తీసుకుని ఆ ధనాన్ని మిగతాదేశాలతోపాటు ఫ్రాన్సుకిచ్చి సహాయం చేస్తోంది. అటువంటప్పుడు ఫ్రాన్సులో ఈ మోసా లేమిటని అడిగే హక్కు అమెరికన్లకి ఉండాలి. ఆ దేశంలో పన్నుల వసూలు మొదలైనవన్నీ చక్కబడితేగాని ఇంక సహాయం చెయ్యబోరని బెదిరించాలి. ఇదేరీతిగా గ్రీస్‌కీ ఇటలీకీ కూడా చెప్పాలి.

పశ్చిమయూరప్‌లో వస్తువులపైనా ద్రవ్యంపైనా విధించబడుతున్న నిర్బంధాల్నిగురించి ఒక సూచన చెయ్యవచ్చును. ఈ సూచన మొదట వికృతంగా కనపడవచ్చును. కాని అక్కడ పరిస్థితులు చక్కబడాలంటే అది తప్పదు. పూర్వకాలంలో పరిస్థితులెలా ఉండేవో, ఆ పరిస్థితులు సృష్టించాలి, అంటే పశ్చిమయూరప్ పూర్వఆర్థికవ్యవస్థని తిరిగి స్థాపించుకోవాలన్నమాట.

1913 లో పశ్చిమయూరప్‌లో ఏదేశంలోనైనాసరే బయలుదేరి మరే దేశానికైనా సరే ఏచిక్కులూ లేకుండా ప్రయాణం చెయ్యగలిగే సౌకర్యం ఉండేది. అప్పుడు పాస్‌పోర్టులు లేవు. ప్రభుత్వం అనుమతించనక్కరలేదు. తృణమో పణమో ఆర్థికసుంకాలుమాత్రమే చెల్లించవలసిఉండేది. దేశాలమధ్య వస్తువుల రవానా నిరాటంకంగా

(36-వ పేజీ చూడుడు)

# ప్రకృతిమాతకు పుట్టిల్లు బ్రెజిల్

**శ్రీ వేమూరి రాధాకృష్ణమూర్తి**

[అనువాదం]

నేటికి సుమారు 450ఏండ్లక్రితం కేబ్రాల్ అను పేరుగల పోర్చుగీసునావికుడు భారతదేశసంపదనుగురించి విని దాని జాడ తెలుసుకొనేందుకై బయలుదేరాడు. అట్లాంటిక్ సముద్రంలో చాలాసేపు తిరిగితిరిగి చివరకు "గోనబరాఖాశం"చేరి భూమిమీద అడుగు పెట్టాడు. యిదే బ్రెజిల్ భూమి. భారతదేశాన్ని కనుగొనలేకపోయినా, దక్షిణ అమెరికాలోని ఒక సారవంతమైన సముద్రతీరాన్ని కేబ్రాల్ కనుగొనగలిగాడు.

కేబ్రాల్ తదనంతరం చాలామంది పోర్చుగీసు నివాసులు బ్రెజిల్ వచ్చి ఆ ప్రదేశాన్ని పరిశీలించారు. బ్రెజిల్ లో వాళ్లకు చాలాచోట్ల బంగారుగనులు లభించాయి. అందువల్లనే బ్రెజిల్ ప్రాంతపు భూమి బంగారుగడ్డ అని ప్రసిద్ధి కెక్కింది. బంగారం దొరకుతుందనే ఆశతో చాలామంది యూరోప్ వాసులు బ్రెజిల్ చేరారు. యీవిధంగా బ్రెజిల్ చాలామంది యూరోపియన్లకు నివాసస్థలమైంది. అధికంగా పోర్చుగీసువారు బ్రెజిల్ వచ్చారు. చాలా శతాబ్దాలవరకు బ్రెజిల్ ను పోర్చుగీసువారే పరిపాలించారు. బ్రెజిల్ స్వతంత్రం పొందినపిమ్మటకూడా పోర్చుగీసు సభ్యత, సంస్కృతుల ప్రభావం తొలగలేదు. నేడుకూడా బ్రెజిల్ లో అధికంగా మాట్లాడేది పోర్చుగీసుభాషయే.

బ్రెజిల్ లో వుండి యూరోపియన్లు వ్యవసాయం ప్రారంభించారు. అక్కడి అడవులవల్ల లాభం పొందారు. అనేకచోట్ల ఖనిజసంపదను వెలికి బైటికి తీశారు. దానిని వుపయోగించారు. అయినా యిప్పటికీగూడా బ్రెజిల్ భూమి లోపలా బైటాకూడా అపారమైన ప్రకృతిసంపద విరజిమ్మబడివుంది. భారతదేశంలో సాగుచేయబడుతూ వున్న భూమికంటే చాలా యెక్కువ భూమి బ్రెజిల్ లో యింతవరకు వ్యర్థంగా పడివుంది. బ్రెజిల్ విస్తీర్ణం భారతదేశంకంటె రెండు రెట్లు అధికం. కాని దాని జనసంఖ్య కేవలం 4,50,00,000మాత్రమే ఈజనసంఖ్య యింకా 10రెట్లు పెరిగినా బ్రెజిల్ భూమి తేలికగా భరించగలదు.

దక్షిణ అమెరికాలోని యితర దేశాలవలెనే బ్రెజిల్ లో కూడా ప్రజాస్వామిక శాసనం ఏర్పడివుంది. 1930నుండి 1945వరకు "గెట్లియోబర్గాస్" అనెడి వాని నియంతృత్వం యిక్కడ సాగుతూవుండేది. 1945లో సైన్యాలన్నీ కలసి బెదిరించేసరికి తన పదవిని వదులుకోవలసివచ్చింది బర్గాస్. తన శాసనకాలంలో పౌరస్వాతంత్ర్యాన్ని అణచివేశాడు. ప్రెస్సుమీద కఠిన సెన్సారు అమలుపరిచాడు. కాని కొన్ని విధాలుగా ఆతడు బ్రెజిలును అభివృద్ధికి తెచ్చాడు. దేశంలో యంత్రాభివృద్ధి గావించాడు. శ్రామికుల సుఖంకోసం చాలా చట్టాలు చేశాడు. ప్రజోపయోగకరమైన చాలా ప్రణాళికలు అమలుపరిచాడు. తన పనులవల్ల మెల్లమెల్లగా ప్రజానాయకుడుగ ఖ్యాతి పొందాడు. అందువల్ల ఆతని శత్రువులకు చాలా భయం వేసింది. బర్గాన్ దేశంలో ఎన్నికలు జరుపుదామని ఏర్పాటు చేశాడు. ఆ ఎన్నికల్లో తాను తప్పక జయించుతాననే ధైర్యం ఆతనికి వుంది. ఎన్నికలనే వంకతో అతడు మళ్ళీ రాజ్యాధికారం చేజిక్కించుకోవాలని కుట్రలు పన్నుతున్నాడని అతని శత్రువులు ప్రచారం ప్రారంభించారు. ఎన్నికలకు ముందే సాయుధసైన్యాల చేత తిరుగుబాటు చేయించారు. దానితో బర్గాన్ తన స్థానాన్నుండి తప్పుకోవలసి వచ్చింది. జనరల్ డుట్రా ఆతడి స్థానాన్ని అధిష్ఠించాడు.

జనరల్ డుట్రా ప్రజాస్వామికవిధానాన్ని తిరిగి దేశంలో ప్రవేశపెట్టాడు. అతడు మితభాషి. ముఖ్యంగా సైనికుడు. పండితుడుగాని, రాజనీతిజ్ఞుడుగాని కాదు. ఆర్థికశాస్త్రసిద్ధాంతాలతో కూడా అతనికి ఎక్కువ పరిచయం లేదు. రాజకీయతళుకుబెళుకులు అసలే శూన్యం. అయినా బ్రెజిల్ ప్రజలకు డుట్రా అంటే అమితగౌరవం, అమితవిశ్వాసం.

జనరల్ డుట్రా సోషల్ డెమోక్రటిక్ పార్టీ సభ్యుడు. బ్రెజిల్ దేశంలోని అన్నిటికంటె పెద్దరాజకీయపార్టీ ప్రస్తుతం యిదే. దీని తరువాత "నేషనల్ డెమోక్రటిక్ పార్టీ యూనియన్"ను పేర్కొనవచ్చును. రాజ్యపరిపాలనకు సంబంధించినంతవరకు యీ పార్టీ సోషల్ డెమోక్రటిక్ పార్టీకి సాయం చేస్తుంది. మాజీఅధినేత బర్గాన్ "బ్రెజిలియన్ లేబర్ పార్టీ"కి నాయకుడు. యింకా కొన్ని పార్టీల పేర్లు క్రింద వ్రాస్తున్నాము. సోషలిష్టు లేబరుపార్టీ, ప్రోగ్రసివ్ సోషలిష్టు,పార్టీ నేషనల్ లేబరుపార్టీ, రిపబ్లికన్ పార్టీ, మాజీ ఫాసిష్టునాయకుడు డాక్టర్ ప్లినియోసాల్గాడో, పాప్యులర్ రిప్రజెంటేటివ్ పార్టీ అధ్యక్షుడు. కమ్యూనిష్టుపార్టీని 1947లో నిషేధించివేశారు. అప్పటినుండి కమ్యూనిష్టు పార్టీనాయకుడు రహస్యంగా తన పార్టీ ప్రచారం సాగిస్తూ వున్నాడని ప్రతీతి.—
1950లో, నూతనరాష్ట్రపతి ఎన్నిక జరుగనున్నది. సోషల్ డెమోక్రటిక్ పార్టీ, నేషనల్ డెమొక్రటిక్ యూనియన్ యీ రెండూ రాష్ట్రపతిఎన్నికసందర్భంలో రాజీపడమని జనరల్ డుట్రా అభిప్రాయమని అంటారు. మాజీఅధినేత బర్గాస్ కూడా యీవిషయంలో చాలా పనిచేస్తూవున్నాడు. "సావపాలో" ప్రదేశపుగవర్నరు, ఎడ్హేమర్ డి బర్రోస్, "బెహియా" ప్రదేశపు గవర్నరు ఆక్టేవియో మెంగాబరాకో కూడా ఎన్నికల గోదాంలో దిగి సాము చేస్తూ వున్నారు. అత్యధికప్రజలకు మాజీవిదేశాంగ మంత్రి ఆస్వాల్డో ఉరాన్ హాసు రాష్ట్రపతిని చేయాలని వుంది.

బ్రెజిల్ రాజ్యాంగం అమెరికా రాజ్యాంగం వలెనే వుంటుంది. అమెరికాలోని అనేక

స్వతంత్రరాజ్యాలవలెనే, బ్రెజిల్‌లో కూడా చాలా స్వతంత్రరాజ్యాలు వున్నాయి. అన్నీ కలిసి ఒక కేంద్ర ప్రభుత్వాధీనంలో వుంటాయి. దేశపు ప్రధానపరిపాలకుని రాష్ట్రపతి అంటారు. అతనిక్రింద ఒక ఉప రాష్ట్రపతి కూడా వుంటాడు. రాష్ట్రపతికి రాజ్యపరిపాలనలో సాయం చేసేటందుకు ఒక మంత్రివర్గం వుంటుంది. ఫెడరల్ పార్లమెంటులో రెండు సభలు వుంటాయి. ఒకదానిని "సెనెట్" అని, రెండవదానిని "ఛేంబర్ ఆఫ్ డిపుటీస్" అని అంటారు. సెనెట్‌కు ప్రతిరాజ్యాన్నుండి యిద్దరు ప్రతినిధుల్ని ఎన్నుకుంటారు. బ్రెజిల్‌లోని యిలాంటి స్వతంత్రరాజ్యాలు మొత్తం ఇరవై వున్నాయి. అందువల్ల సెనెట్ సభ్యుల సంఖ్య నలభై వుంటుంది. ఛేంబర్ ఆఫ్ డిపుటీస్‌కు యెన్నుకొనబడే ప్రతినిధులు యెక్కువగా జనసంఖ్యమీద ఆధారపడివుంటారు. పారిశ్రామికసంస్థలకు, వ్యాపారసంస్థలకు ప్రతినిధులుగా కూడా కొంతమందిని ఎన్నుకుంటారు. ఛేంబర్ ఆఫ్ డిపుటీస్‌లోని మొత్తం సభ్యుల సంఖ్య రెండువందలపదమూడు.

బ్రెజిల్ ప్రకృతిమాతకు పుట్టిల్లు అంటే సందేహం లేదు. ప్రకృతిమాత తన సహజ సౌందర్యసంపదలను బ్రెజిల్‌లో విరజిమ్మింది. బ్రెజిల్ భూమి చాలా సారవంతమైంది. అందువల్ల బ్రెజిల్‌లో వ్యవసాయం విరివిగా సాగుతుంది. బ్రెజిల్ అంతా అడవుల మయం. చాలాచోట్ల ఖనిజాలు విరివిగా లభిస్తాయి. అందువల్ల బ్రెజిల్‌లో పారిశ్రామికాభివృద్ధికి ఎన్నో అవకాశాలు వున్నాయి. కాఫీ పండించే దేశాల్లో బ్రెజిల్ పేరును మొట్టమొదట పేర్కొంటారు. కాఫీ-బ్రెజిల్ యీ రెండుపేర్లు సర్వసాధారణంగా ఒకదానికి బదులు యింకొకటి వాడబడుతూవుంటాయి. యిప్పుడు కాఫీపంట బ్రెజిల్‌కు స్వదేశీపంట అయిపోయింది. 1727వరకు బ్రెజిల్‌లో ఒక్క కాఫీమొక్కగూడా వుండేదిగాదు. అన్నిటికంటే ముందు కాఫీమొక్క ఇథియోపియాలో దొరికింది. 14వశతాబ్దంలో అరబ్ దేశీయులు యీ మొక్కను తమ దేశం తెచ్చారు. 16వ శతాబ్దంలో కాఫీమొక్క టర్కీ చేరింది. మెల్లమెల్లగా యితరదేశాల్లో కూడా కాఫీమొక్క నాటుకుంది. భారతదేశానికి కాఫీమొక్క 1610లో చేరింది. బ్రెజిల్ దేశానికి 1727లో చేరింది. ఇప్పుడు ప్రపంచంలోని యితరదేశాలన్నీ కలిసి ఎంత కాఫీపంట పండిస్తూ వున్నాయో అంతకంటె అధికంగా ఒక్క బ్రెజిల్‌లోనే పండుతూ వుంది. బ్రెజిల్‌లో కోకోపంట గూడా అధికమే. ప్రపంచంలో అత్యధికంగా కోకోపండించే దేశాల్లో బ్రెజిల్ రెండవది.

బ్రెజిల్ ప్రత్తి అమెరికన్‌ప్రత్తి లాగానే వుంటుంది. పర్నాంబుకో, పారాహాయివాది అన్నిటికంటె మేలురకంప్రత్తి. సియరా మొదలైన బ్రెజిల్ అంతర్గతరాజ్యాలలో ప్రత్తి పండుతుంది.

బ్రెజిల్‌లో సుమారు 3, 02, 000 ఎకరముల భూమిలో పొగాకు పండుతుంది. బెహియా, రాయో గ్రేండ్ డిసుల్, మినాస్ జెరాయస్, గోయాజ్, సావపాలో మొదలైన రాజ్యాలలో పొగాకు పండించే పెద్దపెద్ద పొలాలు వున్నాయి.

మొదట యితరదేశాల్లో రబ్బరు తయారు కాకపూర్వం బ్రెజిల్ ప్రపంచంలో రబ్బరును అత్యధికంగా తయారుచేస్తుండేది. ఇక్కడినుండే తీసుకొనివెళ్ళి పెంచినచెట్లనుండి రబ్బరు పండించి ఎంతోధనాన్ని యితరదేశాలు ఆర్జిస్తూవున్నాయి ఇప్పటికీ బ్రెజిల్‌లో రబ్బరు విస్తారంగా తయారవుతుంది. యివిగాక, ధాన్యం, చెరుకు, వగైరాలుకూడా యిక్కడ పండుతాయి. సుమారు 8 లక్షల టన్నుల పంచదార ప్రతిఏటా బ్రెజిల్‌లో తయారవుతుంది.

నూనె తీసే విత్తనాల్ని వైజ్ఞానికపద్ధతిన ప్రోగుచేసే ప్రయత్నం యింకా బ్రెజిల్‌లో ప్రారంభం కాలేదు. రవ్ అమేజన్‌లోయలో నూనెవిత్తనాలమొక్కలు విస్తారంగా వున్నాయి. వాటిని సరిగా వినియోగిస్తే మొత్తంప్రపంచంలో బ్రెజిల్ వనస్పతినూనెకు గొప్ప ఉత్పత్తికేంద్రం అవుతుంది.

సుమారు ఒకకోటి యెకరాల విస్తీర్ణంగల అడవులు బ్రెజిల్‌లో వున్నాయి. యీ అడవులలో అన్నిరకాల శ్రేష్టమైన కర్ర లభిస్తుంది. అమేజన్‌లోయలోని అడవులను యింతవరకు ఎక్కువగా వుపయోగించలేదు.

బ్రెజిల్‌లో యినుము విపరీతంగా వుంది. బ్రెజిల్‌లో దొరికే మొత్తం యినుమును వుపయోగిస్తే యావత్ప్రపంచపు పనిఅంతా ఆరువందల సంవత్సరాలవరకు నిర్విఘ్నంగా కొనసాగుతుంది. ప్రపంచంలోని ఇరవై రెండువంతుల ఇనుంగనులు బ్రెజిల్‌లో వున్నాయి. మేంగనీసుకూడా బ్రెజిల్‌లో చాలా వుంది. బంగారుగనులు, రత్నాలగనులు కూడ యిక్కడ చాలా వున్నాయి.

గతఅర్థశతాబ్దాన్నుండి బ్రెజిల్‌లో యంత్రాభివృద్ధి కాసాగింది. కాని బ్రెజిల్‌లోని ప్రాకృతికసంపదలు చూస్తేమాత్రం యీ యంత్రాభివృద్ధి సూర్యునిముందు దివిటీవలె తోస్తుంది. సావపాలో దగ్గర స్థాపించబడ్డ ఓల్టారాడోండావర్క్సులో ప్రతిసంవత్సరం 4 లక్షల టన్నుల ఉక్కు తయారవుతుంది. బ్రెజిల్‌లో బట్టల పరిశ్రమకూడా అభివృద్ధిలో వుంది. బ్రెజిల్ దేశానికి కావలసినంత సరిపోగా యింకా బైటిదేశాలకు కూడా పంపేటందుకు చాలా గుడ్డ మిగిలి వుంటుంది. ఇక్కడ కొన్ని ఏండ్లవరకు సిమెంటు, కాగితము, పంచదార, రసాయన వస్తువులు మొదలైనవి బైటి దేశాలనుండి తెప్పించుకొనవలసివచ్చేది. కాని యిప్పుడు ఆ అవసరం తీరింది. ఈ వస్తువులన్నీ బ్రెజిల్‌లోనే తయారవుతూ వున్నాయి. బ్రెజిల్‌లో ప్రవహించే జలాశయాల్ని సరిగా వినియోగించుకుంటే బ్రెజిల్ ప్రపంచంలోని మహత్తరమైన పారిశ్రామికరాజ్యంగా మారివుండేది. కాని అనేకకారణాలవల్ల బ్రెజిల్‌లో పారిశ్రామికాభివృద్ధి మెల్లగా సాగింది. అక్కడ ఎక్కువపెట్టుబడిదారులు లేరు. విదేశీపెట్టుబడిదారుల సాయం లేనిదే బ్రెజిల్ తన ప్రణాళికల్ని అమలులో పెట్టలేదు. యంత్రసామగ్రి లోటుగూడా వుంది. మంచి టెక్నీషియన్లు అధికంగా లేరు. పడే శ్రమలో కూడా నేర్పరితనం తక్కువ. మేలురకపు బొగ్గు, కిరసనాయిలుగనులు బ్రెజిల్‌లో చాలా తక్కువ. అందువల్ల యీ వస్తువులన్నీ ఎక్కువగా బైటిదేశాల నుంచి తెప్పించుకోవలసివస్తుంది.

ఇప్పటివరకు బ్రెజిల్‌లో జరిగిన పరిశ్రమాభివృద్ధిఅంతా ముఖ్యంగా విదేశీపెట్టుబడుల వల్లనే జరిగింది. అందరికంటే ముందు ఇంగ్లీషువారు బ్రెజిల్‌లో రైల్వేను నిర్మించి కొన్ని యంత్రాగారాలు స్థాపించి విదేశీ పెట్టుబడిదార్లకు సింహద్వారం తెరిచారు. వారి తరువాత అమెరికన్లు వచ్చారు. అమెరికాలోని పెద్దపెద్ద వ్యాపారకంపెనీల శాఖలన్నీ యిప్పుడు బ్రెజిల్‌లో వున్నాయి. బ్రెజిల్‌లోని పరిశ్రమలకు అమెరికన్లు పెట్టిన పెట్టుబడి సుమారు ముప్పైకోట్లు లేక నలభైకోట్ల డాలర్లవరకు వుంటుందని అంచనా

(36-వ పేజీ చూడుడు)

# అమరావతి

శ్రీమతి డా॥ వారణాసి యశోదాదేవి

అమరలోకములో అమరేంద్రుని ముఖ్యపట్నము అమరావతి. మర్త్యప్రపంచములో, ఆంధ్రదేశములో, గుంటూరుకు 18 మైళ్ళదూరమున, కృష్ణాదక్షిణపరిసరాన వెలసింది అమరావతి. ఇది ఆంధ్రసామ్రాజ్యమును మగధవరకు వ్యాపింపజేసిన శాతవాహనుల రాజధాని. దీపాలదిన్నె, అమరారామము, సుధాన్యకటకము, ధనకటకము, ధాన్యవాటి పేర్లతో ప్రసిద్ధి గాంచినది. ప్రస్తుతము అమరావతి ధరణికోట నామములతో పిల్వబడుచున్నది. బౌద్ధయుగములో గొప్పబౌద్ధక్షేత్రము. విద్యాపీఠముగను, జైన తీర్థముగను, తర్వాతనుండి హిందూపుణ్యక్షేత్రముగను పేరు గాంచిన దమరావతి. రెండువేలుసంవత్సరములుగ తెల్గుకళ లిచట సావరము చేసికొన్నవి. ఇప్పటికి ఆంధ్రకళాలక్ష్మిపోకడ లిచట జీఃకళతో భాసిల్లుచున్నవి.

ఈ జగత్తునందు "అహింసా పరమో ధర్మః" అను సుశాంతశీతలసుమధురఉపదేశమును మానవమండలికి ప్రసాదించిన వీరావతంసుడే బుద్ధభగవానుడు. శాతవాహనుల ప్రోద్బలముతో బౌద్ధము ఆంధ్రభూమిలో వెల్లివిరిసింది. శాక్యసింహుని స్మారకచిహ్నముపై మహాచైత్యము అమరావతిలో క్రీ॥పూ॥ రెండవశతాబ్దములో నిర్మిత మైనది. బౌద్ధుల స్తూపము లేక చైత్యము హిందువులదేవాలయమువంటిదే. అమరావతీస్తూపము యిటుకల కట్టడమో కాదో తెలియదు. దీని చుట్టుకొని యున్న గ్రాది (*railing*), కప్పియున్న పాలరాతిపలకలతొడుగు (*Casing*) క్రీ॥ శ॥ 150–250 ప్రాంతముల కట్టబడ్డవి. తొడుగును స్తూపమునకు లోపలిగ్రాది అని కొందరు భ్రమించిరి. గ్రాది పరిపూర్ణముగ నున్నది. ప్రపంచములో నింత దివ్యమైన జాలు మరెచ్చటను లేదు. దీని వ్యాసము 192 అడుగులు, చుట్టుకొలత 600 అడుగులు, ఎత్తు 14 అడుగులు. ఈ జాలు నిలువురాతిపలకలతో ఒక్కొక్క జంటపలకలమీద 3 అడ్డుపెట్టెల (*Cross bars*) కలిపి నిర్మింపబడినది. నిలువురాళ్లు చదరములపై నిలబడి రెండు అడుగుల 9 అంగుళముల ఎత్తైన మదులు (*Coping*)కు పూతగ నున్నవి. కట్టడము యొక్క ప్రతిభాగము మొత్తము 16,800 చదరపు టడుగులవైశాల్యము – శిల్పముతో క్రిక్కిరిసియున్నది. గ్రాదిపై చెక్కడములలో నాల్గు అడ్డుకమ్మీలున్నవి. ఒక్కొక్క నిలువురాతికి బయటివైపు మధ్యచక్రము, పైన క్రింద అర్ధచక్రములు చెక్కబడ్డవి. వీటిమధ్య అనేకశిల్పములు గలవు. అడ్డుకమ్మీల మీద చిత్రవిచిత్రముగ చక్రములు కల్పింపబడినవి. మదుళ్లమీద మనుష్యులు పువ్వులు పట్టుకొన్నట్లు, చదరములలో శిశువులు జంతువులతో నాడుకొనుచున్నటుల బొమ్మలున్నవి. లోపలివైపు మదుళ్ళమీద, మధ్యచక్రములమీద బుద్ధజీవితజాతకగాథలు మనోహరముగ చిత్రిత మైనవి.

స్తూపమువ్యాసము 162½ అడుగులు. క్రిందిభాగమును కప్పిన పలకలు విరివిగ శిల్పాంకిత మైనవి. వర్తులము ఒక్కొక్క నాల్గవభాగములో (*quadrant*) 12 పలకలున్నవి. ఒక్కొక్కపలకమీద బాగుగ నలంకృతస్తూపము – జాలుతో సహా, మిగత స్థలములో ఇతరశిల్పములు బహుసుందరముగ నున్నవి. ఈ పలకలనుబట్టి అమరావతీ స్తూపాకారము ప్రపంచములో అసమానముగ నుండియుండు నని తెలుస్తుంది. మణిశిలా నిర్మితమై యీ శిల్పసంచయము, పగలు ప్రచండసూర్యరశ్మిలోను రాత్రి గోపురము మీది దీపసహస్రముతో, సమానరహితదివ్యప్రభలతో, భాస్కర్యముగ నుండి యుండును. స్తూపములకట్టు విశిష్టకళను దేవహర్మ్యవాస్తు వనెదరు.

అమరావతీశిల్పములో మధుర, గాంధార, గ్రీకు, అస్సీరియా పర్షియను సింహళకళల ఛాయ లున్నవి. చారిత్రకముగ సాంచి బార్హుట్శిల్పముకన్న అమరావతీశిల్పము ప్రశస్తము. మహాయానబౌద్ధకాలమందలి దగుట యిందు ప్రతిమాశిల్పము, విగ్రహనిర్మాణకళ మూర్తీభవించినవి. ధ్యానబుద్ధుడు పద్మపాణి, ఇత్యాది విగ్రహము లనేకము దొరకినవి. 6 అడుగుల 4 అంగుళముల ఎత్తుగల రెండు బుద్ధవిగ్రహములు, అఘోయవచకితవిర యను ప్రభువుప్రతిమ యిచట గలవు. తల, చేతులు శిథిలములై, గ్రాదివెనుక దొరికిన మనుష్యప్రమాణముకంటె పొడవైన భక్తుని విగ్రహము అమరావతిలోని విగ్రహములన్నిటిలోకి గొప్పది. ఇది అచటిస్తూపమును అలంకరించిన ఆంధ్రచక్రవర్తుల గౌతమీపుత్ర శ్రీ శాతకర్ణి *I* గౌతమీపుత్రశ్రీయజ్ఞశాతకర్ణి *II* – లో నొకరిదై యుండనోపు. ఇతడు రెండుచేతులతో కమలముకురముల బట్టుకొని అంజలి ఘటించుచున్నాడు.

స్తూపమధ్యరంగములో భక్తులు ఆసనమును పూజించుట గాననగును. పైన బుద్ధుడు యోగముద్రయం దున్నాడు. చైత్యసమీపములో చిన్నచిన్నస్తూపము లున్నవి. ఒకదానిమీది, స్త్రీ పురుషులు, సింహములు, అమరావతిశిల్పప్రత్యేకతను సూచించు పూలతీగెలు, ఒక కొలనులోని పద్మపత్రములు, హంసల వరుసలు, ఒక స్తంభముమీది ఆసీన బుద్ధుడు, రాజార్హబౌద్ధచిహ్నములు బహు రమ్యములు. పద్మము, మొగ్గలు, ఆకులు, శిల్పములో బహువిధాలుగ చిత్రితమైనవి. నాల్గురేకులకమలము గాంధార, ఖోటాను, టిబెటుశిల్పములో గూడ గలదు. ఇచటి దిట్టమైన జాలరిశిల్పము గాంధారశిల్పమును, అజంతా 10 వ గుహలోని స్తంభములపై చిత్రముల బోలి యున్నది. భారతశిల్పయౌన్నత్యమును చాటుచున్న యిచటి మణిశిలాశిల్పభాస్కర్యము రంగులవల్ల యెక్కువైన దన్నాడు హావెలుపండితుడు. భారతశిల్పము ధర్మాంగమని, ధర్మభావోద్దీపితమని – అమరావతీస్తూప, విగ్రహముల బట్టి తెలుస్తుంది. స్తూపచతుర్ద్వారములు ఆర్యుల గ్రామమునకు నాల్గువాకిళ్లనియు, జాలు యజ్ఞవాటిని చుట్టుకొనియుండునదే ననియు, మూడు అడ్డుపెట్టెలు త్రిసంధ్యలను, బుద్ధ సంఘ, ధర్మములను, నాల్గు కమ్మీలు చతుర్వేదములను, బుద్ధునిజీవితములో నాల్గు ఘట్టములను సూచించుననియు, వికసితకమలములు అన్నిమతములకు సమాన మని నిర్వచించాడు హావెల్.

సంగీత, నాట్యకళలు శిల్పములో ప్రతిబింబించినవి. ఒక ప్రస్తరములో 18 మంది స్త్రీలు మద్దెలలు, శంఖములు, నాగసరములు, స్వరమండలములు, వీణెలు వాయించుట చిత్రితమైనది. ఇంకను అనేకసంగీతవాద్యములు మిగత శిల్పములలో గాననగును. పాదపూజ, నాగకన్య శిల్పములు నాట్యభంగిమల దెల్పును. స్తూపద్వారముదగ్గర దొరికిన బంగారుస్తూపము 1, 5 అంగుళములు

(30 వ పేజీ చూడుడు)

# ఆంధ్రాష్టపదులు

శ్రీ తిప్పావఝల కోదండరామయ్య

పద్మావతీచరణచారణచక్రవర్తి జయదేవ కవి గీతగోవిందము ప్రపంచసారస్వతములోనే యొక మహత్తరసృష్టి. సంగీతసాహిత్యముల సరససమ్మేళనమున కది యొక యమరోదాహృతి. అద్వైతరసానందానుభూతికి నది యొక సురుచిరయోగము. సుమధురశబ్దవిన్యాసము, సురుచిరభావస్ఫూర్తి సుందరచ్ఛందస్సౌందర్యము సౌందర్యానుభూతిలో సమైక్యమై సచ్చిదానంద సందర్శనానందరసానుభూతిలో దన్మయుల జేయును.

గీతగోవిందమును బ్రియమార బాడుకొని భారతప్రజ మురిసిపోయినది. రాధాకృష్ణుల పవిత్రప్రణయమూర్తులను హృత్ఫలకములలో జిత్రించుకొని రసతన్మయమైనది. వ్రాతప్రతులందు నష్టపదిభావానుకూలముల గుచిత్తరువుల జిత్రించుకొని యానందించినది. క్రీస్తుశకము పదునాఱవశతాబ్దినాడు భారతప్రజ గీతగోవిందము వ్రాతప్రతిలో జిత్రించుకొనిన చిత్రములు జయదేవకవి కవితామూర్తికొక మంగళనీరాజనము. అంతటితో భారతప్రజ పరితృప్తి చెందలేదు. గీతగోవిందమును దేశభాషలలోనికి బరివర్తనము గావించుకొని పరితోష మందినది. భావస్ఫూర్తికి భంగము కలుగకుండ, సంగీతసారస్యమునకు సంగతి చెడకుండ శబ్దవిన్యాసము జజ్ఝువారకుండ, రసానందము డిందుపడకుండ గీతగోవిందస్థాయికి ననువదించుట యది యంత సుకరము కాదు.

తెలుగులో గీతగోవిందమునకు తెలుగు సేతలు ప్రాచీనులే గావించినవి, రెండు కలవు. కార్వేటినగరసంస్థానకవీశ్వరుడు, కవిరాజకంఠీరవబిరుదాంకితుడు నగు ఋగ్వేది వెంకటనారాయణకవి రచించినది యొకటి. కదళీపురనివాసి ఓగిరాల వెంకటరత్నదాసకవి రచించినది మఱియొకటి.

ఋగ్వేది వెంకటనారాయణకవి కార్వేటినగరసంస్థానకవీశ్వరుడు. చంపూరామాయణమును రచించిన ఋగ్వేది వేంకటాచలకవి యితని తండ్రి. కార్వేటినగరాధీశ్వరుడగు వెల్లంటి కసపభూపాలుని ప్రోత్సాహమున నితడు గీతగోవిందమును దెనిగించినట్లు చెప్పుకొనినాడు. ఇతడు లక్షణాపరిణయము, కృష్ణవిలాసము మొదలగు సంస్కృతప్రబంధములను, మదనగోపాలవిజయము మొదలగు తెలుగుకబ్బములను

(31 వ పేజీ చూడుడు)



ఇండియా విమానదళాధిపతిగా పనిచేసి విరమించుకొన్న ఎయిర్ మార్షల్ సర్ థామస్ ఏమ్‌హర్స్ట్ లండన్ బయలుదేరేముందు సేనాధిపతి జనరల్ కె. ఎం. కరియప్ప, నౌకాదళాధిపతి వైస్‌అడ్మిరల్ సర్ విలియంపార్రీలవద్ద సెలవు తీసుకొన్నప్పటి దృశ్యం.

నవల:




శ్రీ నోరి నరసింహశాస్త్రి

## ౨౨

శ్రీ రుద్రదేవమహారాజు ఏకశిలానగరమునకు బలిష్ఠ మగు శిలాప్రాకార మొకటి వెంటనే నిర్మింప నిశ్చయించెనుగదా! ఆ నిశ్చయమైన దాది సంభారములు చురుకుగా చేర్పింపబడుచుండెను. స్థపతులును మాపకులును సూత్రధారులును కరణములును ముందు ఆ శిలాప్రాకారమునకును దాని కందకమునకును కావలసిన ప్రదేశము నిర్ణయించి గుర్తులు వేయుచుండిరి. ఆ గుర్తించిన ప్రదేశములలో పలువురు పేదలయు కొందరు ధనవంతులయు గృహారామక్షేత్రములు పడినందున అవి తీసివేయవలసివచ్చెను. పేదవారికి రాజపురుషులు వేరు నివాసప్రదేశములు చూపి మరల నిండ్లు కట్టుకొనుటకు వస్తురూపమునను ధనరూపమునను సహాయము చేయ నేర్పాట్లు చేయుచుండిరి. ధనవంతులకును అట్లే యథోచితముగా నష్టపరిహారము గావించుచుండిరి. ఇవియన్నియు లెక్కలు వేయగా బహుద్రవ్యము కావలసివచ్చెను. ఐనను ఎంతవ్యయమునకైనను వెనుదీయక పనులు వెంటవెంటనే సాగింపవలసినదని రాజాజ్ఞ యయ్యెను.

ముందనుకొన్న విధముగా ఓరుగల్లుకు దూరమున గల ఇనుపరాతిగుట్టనుండి గండశిలలు రేయింబవళ్లు బండ్లమీదను యంత్రముల మీదను యథోచితస్థానములకు చేరుచున్నవి.

కట్టదలచిన ప్రాకారకుడ్యమునకు ఈవైపున నావైపున రెండువైపుల రెండు రాతిగోడలు కట్టి ఆ రెండురాతిగోడల మధ్యనున్న భాగ మంతయు మట్టితో పూరించి అంతయు నొకటే శిలాప్రాకారముగా చేయుట దాని నిర్మాణపద్ధతి! ఈ పద్ధతి యవలంబించుటచే నెన్నియో సౌలభ్యములు చేకూరెను. అంతయు శిలలతో నిర్మించినచో ఎన్నియో పర్వతములే కొట్టి తెప్పించినగాని పని పూర్తి కాదు. అది ఎప్పటికి సాధ్యమగును? అదిగాక కోటగోడ మధ్యభాగమున మట్టియే యున్న రాకపోకలకు ఏకాలమునకైనను ఏవేళనైనను ఎక్కువ సౌకర్య ముండును. అదియునుగాక కందకము త్రవ్వగా వచ్చిన మట్టి ఏమి చేయుట? అది దూరము చేర్చుట అధికవ్యయప్రయాసలతో కూడినపని. అట్లు కాక అది కందకము ప్రక్కనే పోసినచో నది యొక కొండవలె పెరిగి స్థలమాక్రమించుటయే కాక దండెత్తివచ్చు శత్రువుల సైన్యములకు గోడగా నేర్పడి వారికి రక్షణ కుపయోగపడవచ్చును. మరియు వర్షాదుల కా మట్టి కారి కందకములోనికి కొట్టుకొనివచ్చి పూడ్చివేయుచుండును. అందుచే కందకమును తరుచుగా మరలమరల త్రవ్వింపవలసిన పని యేర్పడగలదు. రెండు రాతిగోడల మధ్యప్రదేశమును ఆ మట్టితోడనే పూడ్చివేసినచో అన్నివిధముల సులభ మగును.

అందుచే నగర్తయు శిలాప్రాకారనిర్మాణమును ఒక్కపర్యాయమే ప్రారంభింపబడెను. అగర్త త్రవ్వించుటలో నా స్థలమున గండశిల లున్నట్లు కనుగొనబడెను. వెంటనే స్థపతు లాశిలను పరీక్షించి దానినే శిలాప్రాకారనిర్మాణమునకు వాడుకొనవచ్చునని నిర్ధారణచేసిరి. కందకప్రదేశము పొడుగునను త్రవ్వి పరీక్షింపగా నట్టి శిలలు దొరకెను. దానితో యోజనదూరమున నున్న ఇనుపరాతిగుట్టనుండి గండశిలలు తెప్పింపవలసిన యవసరము తప్పిపోయినది. కందకప్రదేశములో దొరకిన ఆ శిలలే మహారాజుపాలిటికి రత్నముల గనిగా భాసించెను. ఎంతయో వ్యయప్రయాసలు తగ్గిపోయినవి. ఇది రుద్రదేవమహారాజులకు గొప్ప శుభసూచనముగా శాకునికులు నిర్ధారణచేసిరి. పనికూడ శీఘ్రముగా సాంత మగు నవకాశమును జిక్కినది.

శ్రీరుద్రదేవమహారాజుల యదృష్ట మంతటితో నాగలేదు. ఆ కందకము త్రవ్వుచుండగా అచ్చట నిజముగా బంగారు వెండి రత్నములు నున్న నిధులుగూడ ఎన్నియో దొరకినవి. అవియన్నియు రాజకోశమునకు చేరెను. ఈ నాడొక నిధి దొరికినదని యందరు నాశ్చర్యపడుచుండ నంతలో మరియొకయెడ ఇంకొక నిధి కనుపించును. శ్రీరుద్రదేవమహారాజుల యదృష్టమును జ్యోతిషికుల యద్భుతప్రజ్ఞను ప్రజలందరు శ్లాఘింపజొచ్చిరి. ఆవిధముగా విశేషధనము లభించుటచే శిలాప్రాకారనిర్మాణ మంతయు నా దొరకిన నిధుల ద్రవ్యముతోడనే సరిపెట్టవచ్చునని తోచెను. అట్లు విశేషధనము లభ్యమైనందున మహారాజా ద్రవ్యమంతయు తానే అనుభవింపదలంపలేదు. పరిఖాప్రాకారములక్రింద తమ గృహారామాదులు కోల్పోయినవారి కందరకు ముందటికంటె ఇబ్బడిగా ధనము బహూకరించుటకును పనివారికి బత్తెము లెక్కువచేయుటకును మహారాజు శాసించెను. దానితో ప్రజలందరు, పెద్దలును, పిన్నలును, శ్రీరుద్రదేవమహారాజుల వితరణను వేనోళ్ల శ్లాఘించుచు యథాధికారముగా వారి కాశీర్వాదములును నమస్కారములును గావించుచుండిరి.

ఇట్లు అగడ్తక్రింద రావలసిన స్థలములో మన జైనవసతిలో నొక ప్రక్కను ఊరక పడియున్న కొంతస్థలముకూడ పడినది. అది మాపకులు కొలతవేయగా సూత్రధారుల సాయముతో స్థపతులు దాని వేరుచేసి గుర్తింపజేసిరి. కరణములు దానికి పరిహారముగా నెంత ధనము చెల్లింపవలసియుండునో కూడా లెక్కలు కట్టి నిర్ధారణ చేసిరి. అట్లు కాక వసతియధికారులు అంతస్థలమే కావలె నని కోరికొన్నను ఆవలివైపున నంత స్థలమును సంపాదించి వసతి కిప్పించుటకును రాజపురుషు లేర్పాట్లు కావించిరి.

రాజపురుషు లట్లు గుర్తించి మేకులు పాతిపోయిన మరుసటి నాటి యుదయమున జూడ సరిగా నేమినాథతీర్థంకరుని విగ్రహ మా ప్రదేశమున వెలసియుండెను. అదియును క్రొత్తగా పెట్టినట్లు లేదు. భూమిలోనుండియే పగులగొట్టుకొని పైకి వచ్చినదా యన్నట్లు చూపరకు తోచుచుండెను. విగ్రహము వెలసినచో పూజించు భక్తుల కేమి కొదువ? రాజపురుషు లక్కడికి వచ్చునప్పటికి నేమినాథదేవుని పూజించుటకు భక్తులు తండోపతండములుగనే వచ్చుచుండిరి.

అది చూడ రాజపురుషుల కేమియు దోచలేదు. వెంటనే వారు ఆ వసతిప్రధానాచార్యు డగు సిద్ధనందిని దర్శించి నమస్కరించి విషయము నివేదించిరి.

సిద్ధనంద్యాచార్యులు మిక్కిలి వృద్ధులు. ఆయన కీ లోకముతో నిజముగా సంబంధమే లేదు. చిరకాలము సిద్ధసాధన లొనర్చి ఆప్తపదవి నొందుటకు అధికృతుడై జైనపరిభాషలో సర్వకషాయములు వదలి నిర్జరు డైయున్నాడు. కర్మబంధము నాయన తూలించుకొనెను. వసతిలోని యాచార్యులందెల్ల నాయన వృద్ధుడైనందునను పూజ్యుడైనందునను తప్పనిసరిగా నా వసతికి ప్రధాని యయ్యెను. కాని యా వసతివ్యవహారములలో నాయన జోక్యము కలిగించుకొనుట ఎన్నడో చాలించెను. అందుచే ఇతరదిగంబరులు పూజ్యుడగు సిద్ధనంద్యాచార్యుల పత్రములును ముద్రికయు చేకొని వ్యవహరించుచుండిరి.

ఇట్టి స్థితిలో రాజపురుషులు సిద్ధనంద్యాచార్యులకు ఈ వ్యవహారము నివేదింపగా నాయన మాటాడలేదు. ఈ వ్యవహారవిషయము ఆయన మనస్సునకు పట్టినట్లే లేదు. ఆయన చేసిన సంజ్ఞలకు వసతివ్యవహర్తలతో సంప్రదింపు డని యర్థమైనట్లు ప్రక్కనున్న వారు చెప్పిరి. అంతట రాజపురుషులు ఆ ప్రధానాచార్యులకు మ్రొక్కి వ్యవహారశాలకు బోయిరి.

ఆ వసతివ్యవహారశాలలో పలువురు కరణములును మువ్వురు శ్రమణులును గలరు. ఆ మువ్వురు శ్రమణులే వసతివ్యవహారములు ఇప్పుడు చూచుచున్నవారు. రాజపురుషులు సగౌరవముగా వారికి మ్రొక్కి అగడ్తకు గుర్తించిన ప్రదేశమును అప్పగించవలసిందిగా కోరిరి.

కాని యీ వ్యవహర్తల భంగి యపూర్వముగా నుండెను.

"ఏది ఎట్లున్నను అక్కడ వెలసిన నేమినాథస్వామిని ఎవరు తీయగలరు?"

"నిగ్రహానుగ్రహసమర్థు లగు మీరే దాని కుపాయ మూహింపవలెను. ఇంత రాజకార్యము ఆగిపోవు టెట్లు?—అదికాక అది క్రొత్తగా గుర్తించినతర్వాత అక్కడ పెట్టినదేగదా!"

"మేము పెట్టిన దని యందురా? పాపచింతలు శమించుగాక!"

"మీరు పెట్టిన దనలేదు. ఎవరో తెల్లవారుసరి కక్కడ పెట్టిరి. పరిఖకు విఘ్నము వచ్చినది!"

"ఒకరు పెట్టిన నట్టి మూర్తి నిలుచునా? అక్కడ పరిఖ త్రవ్వుట తీర్థంకరులకు సమ్మతము కాదేమో!"

ఇట్లెంత చెప్పినను ఆ వ్యవహర్తలు రాజపురుషులకు ఆటంకములు చెప్పిరి.

"ఇది దేవస్వము. మా వసతికి మహారాజుపూర్వులు దీని నెన్నడో దానము చేసిరి. దానము చేసినదానిని మరల తీసికొనుట ధర్మమా? అదికాక తీర్థంకరులకు అంకితమైన ప్రదేశములో ఒక్క సూదిమోపు మేరయైనను వదలివేయుటకు గాని మార్చుటకు గాని మా కేమి యధికారము కలదు? మేము ధనము చేతులతోనైన స్పృశింపమే. అట్టిచో పరధనము లపేక్షింతుమా? ఇక మమ్మును తీర్థంకరుల ద్రవ్యమునే ముట్టమని మీరు కోరుదురా? అట్లు చేసి జన్మజన్మలలో విధిగా వచ్చు బాధలు మేము పడజాలము!—"

ఈవిధముగా నున్న దావ్యవహర్తల వైఖరి మొత్తముమీద! రాజపురుషు లెన్నివిధముల జెప్పినను వారు వినలేదు. ఆవల దానికి రెండింతలు స్థలము ఇప్పింతుమన్నను వా రంగీకరింపలేదు. విశేషధన మిప్పింతు మనిరి. వారు వినలేదు. తుదకు ఆ నేమినాథవిగ్రహమును అక్కడ తెల్లవారుసరికి పెట్టించినవారు కూడ వీరే యని రాజపురుషులకు మనస్సులలో నిశ్చయభావ ముదయించెను.

ఆ రాతికోటనిర్మాణకార్యక్రమమునకు సర్వాధికారిగా అంబదేవుని శ్రీరుద్రదేవమహారాజు నియమించియుండెను. ఆ వసతితో వచ్చిన చిక్కు రాజపురుషులు వెంటనే సర్వాధికారి యగు నంబదేవునికి నివేదించిరి. అంబదేవుడు ఒక్కకొంతతడవు ఆలోచించెను. ముందు తనకు స్థపతులు చూపియుండిన కోట అగడ్త ఇత్యాదుల నిర్మాణచిత్రములలో నది యీ వసతి నాని పోవుచున్నట్లే జ్ఞాపకమున్నదికాని వసతిప్రదేశముపైనుండి పోవుచున్నట్లు లేదు. ఆ జైనవసతియే కాదు. ఏదేవస్వదేశమునుగూడ ఆక్రమింపవలసిన యగత్యము లేకుండనే వా రది సిద్ధము చేసియుండిరి. అందుచే ముందు అంబదేవుడు మరల నా నిర్మాణపటములు తెప్పించి పరీక్షించెను. తన స్మృతిలో భ్రాంతి లేదు. పరిఖకు కొంచెము ఎడముగనే వసతి ప్రదేశ మున్నది. అట్లయినచో ఆ స్థలములోనికి వసతిప్రదేశ మెట్లు వచ్చినది? వ్రాయసకాండ్ర తప్పా? ఎక్కడ నున్న దా తప్పు?

ఆ వెంటనే అతడు జైనవసతి కిచ్చిన దానశాసనప్రతి తెప్పించి పరీక్షించెను. మరునాడే దానిప్రకారము వసతిస్థలమును కొలిపించి దాని సీమలు నిర్ధారణచేసి గుర్తులు పెట్టించెను. ముందు స్థపతు లిచ్చిన పటముల స్వరూపములో తప్పులేదు. ఇప్పుడు వసతి ప్రదేశ మని వసతిపెద్దలు వివదించుచున్న ప్రదేశము వసతిది కాదని స్పష్టపడెను. ఊరక ఆ ప్రదేశ మున్నసమయమున వసతివారు ఆక్రమించినట్లు అక్కడ నొక మొక్క, ఇక్కడ నొక స్తంభము పాతి తమ దనుచుండిరి. ఇప్పుడు ప్రాకారనిర్మాణమునకు విఘ్నము కలిగించు దురుద్దేశముతో నేమినాథుని విగ్రహ మొకటి నిలువబెట్టినట్లున్నారు. ఒక్కసారిగా నంబదేవునకు రోషము ప్రకోపించెను.

వెంటనే ఆతడు వసతియధికారులకు ఆ ప్రదేశమును అరువది

(29 వ పేజీచూడుడు)

కథానిక:

# "నవ్వీన నాప చేను..."

శ్రీమతి బారు సరోజనీదేవి

ఎర్స్కిన్ కాలేజీనుంచి బస్సుకోసం జయపురంరాజుగారి బొమ్మవరకూ నడచేలోగా, వుదయం పదిగంటల్నుంచీ సాయంకాలం అయిదయ్యేవరకూ జరిగినసంగతులన్నిటినీ హాస్యంగా నెమరువేసుకోడం, ఉష, శారదల కిద్దరికీ అలవాటు. ఇద్దరి మధ్యా స్నేహం అంతగా లేనప్పుడింత చనువుగా మాట్లాడుకోకపోయినా, నడుస్తున్నప్పుడు, ఎదురుగా వచ్చేవాళ్ళచూపులనుంచి తప్పించుకోందామన్న బాధ రానురాను ఈ అలవాటుగా మారివుండచ్చు.

ఎప్పుడూ ఎవ్వరూ క్లాసులో వేళాకోళం చెయ్యని శారదని ఇవాళ ఎవడో ఏదో అన్నాడు. అది మనస్సులో వేధిస్తున్నందువల్ల కాబోలు శారద ఈరోజున ఉషతో చురుకుగా మాట్లాడ్డంలేదు. ఉషకి యీవిషయం తెలియక మామూలు ధోరణిలో యేవేవో చెప్తున్నది. వాళ్ల మేనత్తగారింట్లోకి క్రిందటిరోజునే మారినట్టు, ఇప్పుడు రోజూలాగ కాకుండా ఏ, వి, ఎన్, కాలేజీరోడ్డుదగ్గిరే కారు దిగవలసివున్నట్టు, మరేవేవో. శారద పరధ్యానంగా వున్నందువల్ల వినిపించుకోవడంలేదు.

"అలావున్నావేమే, శారదా?" అని ఉష గదమాయించేదాకా శారద సంభాషణలోకి, దిగలేదు. "మైత్రా స్క్వేర్, దగ్గరకి వెడుతూవుంటే సీతాపతి 'ఓయబ్బో హంసల్లే నడుస్తోందిరోయ్' అన్నాడు. ప్రక్కనే నిలబడివున్న మేష్టరు వినీవిననట్టు ఊరుకున్నాడు."

"పో పో ఎవరేమన్నా ఊరుకుంటావు, హంసల్లే నడిచావు కామాల్ను, అన్నాడు. ఇంత పౌరుషం వున్నదానివి సమాధానం చెప్పలేకపోయావా మరి? అచ్చే ఎందుకు చెపుతావు. నీకూ కొంచెంగా సరదా ఉంది."

ఉషగోరణికి యేమాత్రం దోహదం యిచ్చినా తనని యేడిపిస్తుందని శారద గ్రహించుకుని మళ్ళీ మౌనం వహించింది.



ఇద్దరూ జయపురంరాజుగారి శిలాప్రతిమ ఉన్న ఆవరణదగ్గర కు వచ్చి, బస్సు రావడానికి ఇంకా ఆలస్యం ఉన్నందువల్ల అక్కడ తూము గట్టుమీద చతికిలపడ్డారు. ఉషమళ్ళీ తన ఇల్లుమారడం సంగతి చెప్తోంది.

"స్వంతయిల్లు వదిలేసుకుని, అట్లా మారేరేం?" అని శారద అడిగింది. "నేను చెప్పేదాన్ని కాదులే, మా నాన్నగారికి మా మామయ్యకి పడేదికాదనీ, మా మామయ్య పోయినతరువాత మా అత్తయ్య మగసాయం లేక మా నాన్నగార్నీ, నన్నూ, మా అమ్మనీ వాళ్ళయింటికే వచ్చి వుండమంటూన్నదనీ. కాని మా అమ్మకి సరిగ్గా ఇష్టంలేక ఈ రెండుసంవత్సరాల్నుంచీ వెళ్ళడంలేదు. మీ బావ పైలట్‌గా వున్నాడనీ యేదో చెప్పేదానివి కాదులే?

"మా బావ వస్తాడుట నాలుగైదు రోజుల్లో. మాఅత్తయ్య ఇంటికొచ్చెయ్యమని ఏడుస్తూ వుత్తరాలు వ్రాస్తూవుంటే, వుద్యోగం మానుకుని వచ్చేస్తున్నాడు!"

"బాగానే వుంది మీ నాన్నగారేమో, మీ అమ్మకి యిష్టంలేక మీ అత్తయ్యగారి యింట్లోకి మారలేదు. మీ బావేమో వాళ్ళ అమ్మకి ఇష్టంలేదని ఉద్యోగం మానేస్తున్నాడు."

"మా అత్తయ్యకేం బోలెడంత ఆస్తి, కావుకు ఉద్యోగం చెయ్యకపోతే లెక్కా యేమిటి?"

"సరే నాకు తెలుసు, నువ్వు మీ అత్తయ్యని పొగడ్డంలేదు. మీ బావని పొగుడుతున్నావు" శారద చాల చిలిపిగా నవ్వుతోంది.

"చాల్లేవే నేర్చుకుపోయావ్!! అని ఉష అంటూవుండగానే బస్సువచ్చి ఆగడం,

యిద్దరూ కబుర్లు ఒక్కసారిగా ఆపుజేసి, దాంట్లో యెక్కిపోవడం జరిగిపోయింది.

ఉషా, వాళ్లమ్మా, నాన్నా వాళ్ళ అత్తయ్యగారి ఇంటికొచ్చి రెండురోజు లయింది. రెండేళ్లనుండీ జనసంచారం తక్కువగా వుండడంవల్ల నిద్రపోతున్నట్టున్న ఇల్లు మళ్ళా కళకళలాడడం ప్రారంభించినా లక్ష్మమ్మగారికి. అనుకున్నంత సంతోషంగా లేదు. ఇన్నాళ్లు పెళ్లాన్నీ, పిల్లనీ తీసుకొచ్చేసి తనయింట్లోనే వుండమన యెంత బ్రతిమాలినా రాని తన తమ్ముడు, ఒక్కసారి హఠాత్తుగా వచ్చేస్తున్నానని చెప్పి, వచ్చి దిగిపోతే చాలా సంతోషంగా వుండవలసిందే ఆవిడకి. కాని, ఒకటి రెండురోజుల్లో కొడుకు వస్తాడన్న సంతోషం, మొన్న మొన్నటి వరకూ రానంటున్న తమ్ముడు హఠాత్తుగా వచ్చి దిగిపోవడంవల్ల వచ్చిన సంతోషం యీ రెండూ మనస్సులో సరిగ్గా ఇమడ్డంలేదు.

తమ్ముడు రామారావు సంసారంతో ఇంటికి వచ్చిన రెండు రోజులకి, లక్ష్మమ్మగారి కొడుకు సుందరం ఇంటికి వచ్చాడు. అతను తన మేనత్తతో అంత కలివిడిగా మసలకపోయినా, ఆవిడే తన శక్తి వున్నంత వరకూ లక్ష్మమ్మగారు కొడుకుమీద చూపించేంత అభిమానం తను కూడా చూపుతున్నది. ఎప్పుడూ లేనిది, మేనత్త ఇంతగా ఆపేక్ష ఎందుకు చూపిస్తూందో సుందరానికి అర్థం కావడంలేదు. వదినగారు చూపించే యీ ఆపేక్ష లక్ష్మమ్మగారికూడా సరిగ్గా అవగాహన కాకపోయినా, ఆవిడ అంతగా పట్టించుకోలేదు.

మేనత్త చూపిస్తున్న ఈ ఆపేక్షకి కారణాల్ని సుందరం వూహించుకుంటున్నాడు. కాని లక్ష్మమ్మగారంతగా ఈ గొడవ పట్టించుకోకపోవడానికి కారణాలున్నయ్. తన ఆస్తి తమ్ముడికి అక్కర్లేదు. అతనికే కావలసినంత ఆస్తి వుంది. కూతుర్ని తన కొడుక్కిచ్చి పెళ్లి చెయ్యడానికా అంటే, అలాంటి ఆలోచన కేం ఆధారం లేదు. తన కొడుకు పెద్దవాడైనా స్కూలు ఫైనలుదాకానే చదివాడు. మేనగోడలు ఉష బి. యస్. సి. నాలుగోయేడు చదువుతోంది. యెంత చుట్టరికం, ఆస్తికలవాళ్లైనా కూతురుకన్నా తక్కువ చదువుకొన్నవాళ్లకిచ్చి పెళ్లిచెయ్యడం ఏతల్లి, దండ్రులికి సాధారణంగా యిష్టం వుంటుంది? మరి ఆస్తే అక్కర్లేక, కొడుక్కి తన కూతుర్నిచ్చే వుద్దేశ్యమూ లేక, తన వదినగారెందు కింత మంచిగా మారిపోయినట్టు? ఈ ప్రశ్న లక్ష్మమ్మగార్ని అంతగా బాధించడంలేదు. కాని వదినగారయిన సీతమ్మగారు ప్రదర్శిస్తున్న అసహజమైన ఆపేక్షవల్ల ఇంట్లో మసులుతున్న మనుష్యులమధ్య వ్యవహారాలు కొత్తపంథా పట్టాయి.

సీతమ్మగారేమన్నా, ఏంచేసినా, వెనక యేదో బ్రహ్మాండమైన పితూరీ వుందని లక్ష్మమ్మగారనుకొంటూవుండడం, లక్ష్మమ్మగారేంచేసినా, అన్నా, తనని అనుమానిస్తున్నట్టు, సీతమ్మగారనుకుంటూవుండడం, యీ అనుకోవడాలవల్ల పైకి వ్యక్తమయ్యే భావాల్ని చూసుకొని, వారిద్దరిచుట్టూ తిరిగే గ్రహాలుకూడా అట్లానే ప్రవర్తించబోవడం, బాగా స్పష్టంగా వున్నది, ఇంట్లో వున్నవాళ్ల మొహాల్లో.

అయితే పరిస్థితులు ఇంత తేలికయిన కలతలతో కొట్టుకుపోవడం భగవంతుడి కిష్టం లేదు. లక్ష్మమ్మ, సీతమ్మగార్లకు ప్రతి రోజూ మధ్యాహ్నమప్పుడు, యీ కలతలు ఎట్లా బయలుదేరాయన్న సంగతి విడమర్చుకోడానికి తగిన సావకాశం కలుగుతూ వున్నా, ఆ సంభాషణకి కావలసిన మనస్థైర్యాన్ని ఇద్దరూకూడా కూడదీసుకోలేకపోతూవుండేవారు. అవసరంవున్న మనిషి గనక, సీతమ్మగారు యీమాటా ఆమాటా మధ్య సుందరానికి ఉషనిచ్చి పెళ్లిచేస్తే బాగుంటుందేమో అని చూచాయగా అనేదాకా సీతమ్మగారి మంచితనానికి గల కారణం వ్యక్తం కాలేదు లక్ష్మమ్మగారికి.

వదినగారికి తన కొడుకుమీద ఆశ వున్నట్టు స్థిరపడగానే, లక్ష్మమ్మగారు వెనకా ముందూ ఆలోచించసాగింది. 'తన కొడుకు తక్కువ చదువుకున్నాడు. పెళ్లి తర్వాత పరిస్థితులు సరిగ్గా వుండవేమోఅని ముఖ్యంగా వ్యాకులపడుతూ వున్నా, వదినగారు ప్రత్యేకంగా యెంతో గౌరవం అభినయించడం చాలా బాధగా వుంది ఆమెకి. ఈ బాధే వదినగారి కోర్కెకి సమాధానం చెప్పేయ్యమంటోంది; అదేం లాభం లేదమ్మా అని. కాని లక్ష్మమ్మగారు తొందరపడదల్చుకోలేదు. ఈ విషయంలో తన భూముల గొడవలూ అవీచూస్తూ పెద్దగా మసుల్తున్న తమ్ముడూ, యేళ్లొచ్చి అనుభవం గడించుకొన్న కొడుకూ వుండగా ఆవిడేం బాధపడదల్చుకోలేదు.

కాని సీతమ్మవదిన తనమీద అనేక రూపాల్లో వాడుతున్న వొత్తిడిని తమ్ముడిమీదికీ, కొడుకుమీదికీ తోసేద్దామని నిర్ణయించుకుంది.

కొడకుపెళ్ళిబాధ్యతని తన భుజాలమీద నుంచి మార్చుకోడానికి నిర్ణయించుకొన్న లక్ష్మమ్మగారు, కార్యాచరణకి సమయం చూసుకొంది. ఒకరోజు రాత్రి భోజనాల దగ్గర తమ్ముడు రామారావుని పలుకరించింది.

“ఒరే తమ్ముడూ, పెళ్ళాం లేకుండగా వాడూ, కోడలు లేకుండా నేనూ వుండడం అంత బాగుండలేదురా. నువ్వేదో యీ విషయంలో కలుగజేసుకుంటే వాడో యింటివాడూ అవుతాడు, నాకు కోడలూ వస్తుంది.”

రామారావుగారు ఏమీ జబాబివ్వలేదు. సుందరం తలవంచుకొనే వున్నాడు. నెయ్యి వడ్డింపుకోసం ఆగదిలోనే వున్న ఉష కూడా తలవంచుకునే వున్నది. కాని ఎంతో నిశ్శబ్దంగా వున్న వాతావరణాన్ని సీతమ్మగారు చాలా అసందర్భంగా చీల్చేసినారు; “సుందరానికి యిప్పుడు పెళ్ళిచేసెయ్యాలని వుంటే ఆయన సంబంధం చూడ్డం ఎంతసేపూ, యిట్టే చూస్తారు” అని. తరవాత ఒదినగారితో “ఉష నీ కోడలు ముచ్చటగా చేసుకొంమూ” అని ఒక నవ్వు నవ్వింది. ఈ మాటల్ని సహజంగా అంటే చాలా సబబుగా వుండేదేమో కాని, ఆవిడ నవ్విన నవ్వు ఆమెమనస్సులో వున్న వుద్దేశ్యం యొక్క నిజస్వరూపాన్ని బయటపడేసింది

ఎదుటవారి మాటలు అర్థంచేసుకోవడం లక్ష్మమగారికి సహజంగా వచ్చిన విద్య. నిదానంగా మసలడం ఆవిడ ఒకర్ని చూసుకొని నేర్చుకోలేదు. యెంత నిదానంగల మనిషి కాకపోతే తన కొడుకుపెళ్ళిబాధ్యత యింకొకరి కొప్పజెప్పగలదు?

సీతమ్మగారన్నమాటలు లక్ష్మమ్మగారికి చాలా అసందర్భంగా కనబడ్డాయి. ఎంతో విశ్వాసంతో తమ్ముడికి తన భారాన్ని ఒప్పజెప్పబోతూవుంటే, తన ఒదినగారు యిలా తేలిపోవడం ఆవిడ కేమీ నచ్చలేదు. ఆలోచించి “సర్లే సీతమ్మా, నువ్వు జ్ఞాపకం చెయ్యాలా ఉషని? అది పుట్టినప్పటినుంచీ మేనగోడలుగానే చూచుకొంటున్నాను”అన్నది. తన

(33-వ పేజీ చూడుడు)

# ప్రభుత్వము-విమర్శకులు

శ్రీ సహజానందం

ప్రజాస్వామ్యంలో అన్ని స్వాతంత్ర్యాల్లోకి ముఖ్యమైనది విమర్శన. నిర్భయంగా, నిష్కర్షగా ప్రభుత్వాన్ని, అధికారులను వారివారి కార్యకలాపాలబట్టి విమర్శించవచ్చు. ఈ అవకాశం ప్రతి పౌరునికీ ఉంది. పల్లెల్లోని సభల్లో, నగరాల్లోని సమావేశాల్లో రాష్ట్ర, కేంద్రశాసనసభల్లో ఈ విమర్శన ప్రతిధ్వనిస్తూఉంటుంది.

ఆలోచనాస్వాతంత్ర్యం, వాక్స్వాతంత్ర్యం అత్యవసరం. ఇవి సిద్ధింపజేసుకోలేని వ్యక్తి ఎలా మూఢుడైయుంటాడో, అలాగే ఈ అవకాశాలు లేని సంఘంకూడా పురోభివృద్ధి లేక, పరిపాలకులను గుడ్డిగా, మూఢంగా అనుసరించే మందబుద్ధుల కూటమిగా మారుతుంది.

ఈ విమర్శన ఒక్క ప్రభుత్వంపట్లన, ప్రభుత్వాన్ని నిర్వహించే పార్టీగాని పార్టీలపట్లనగాని మాత్రమే కాదు. ఏ పార్టీనైనా, ఏనాయకుడినైనా విమర్శించవచ్చు. పత్రికల్లో, ఉపన్యాసాల్లో ఒకరి నొకరు తీవ్రంగా విమర్శించుకొంటారు.

గాలి, వెలుతురుతోపాటు చదువుసంధ్యలు కూడా అందరికీ లభించాలనే ఈయుగంలో బళ్లోకుర్రవాడినుంచి నాయక, ఉపనాయకులవరకూ ఈ విమర్శకు పూనుకుంటున్నారు.

మన రాజ్యవ్యవస్థకు ప్రజాస్వామ్యం పునాది. మిగతా లోపాలెన్నిఉన్నా, ఈ ప్రజాస్వామ్యం సంపూర్ణం కాకపోయినా, ప్రజాస్వామ్యతత్వాన్ని మూలసూత్రం చేయటం ప్రజల పురోభివృద్ధిలో మొదటిమెట్టు. కాబట్టే అక్కడక్కడ, అప్పుడప్పుడు ప్రభుత్వాలు, అధికారులు కొద్దిగొప్పల్లో నిరంకుశంగా ప్రవర్తించినా, ప్రవర్తిస్తున్నా, సామాన్యంగా ప్రభుత్వాలు అన్నివైపులనుంచి తీవ్రవిమర్శకు గురి అవుతున్నయ్.

నిన్నటివరకు కాంగ్రెసుకు, జాతీయోద్యమానికి జన్మశత్రువుగా ఉన్న ముస్లింలీగు సభ్యులు ఇప్పుడుకూడా మన శాసనసభల్లో, పత్రికాప్రకటనల్లో నిర్భయంగా తమ భావాలను, విమర్శనను వెల్లడించుకోగలుగుతున్నారనుటయే మన ప్రజాస్వామ్యానికో నిదర్శనం - అయితే ఈ లీగుసభ్యులు బహిరంగసభల్లో తమ పాతడబ్బాల నుపయోగించుకొనగలిగే రోజులు పోయినయ్.

అలాగే ఇటీవల కలకత్తాలో కమ్యూనిస్టులు తెరవెనక ఉండి, జరిపించిన 'శాంతి సభకు' జైల్లోని డిటెన్యూలు, ఒక సందేశం పంపారు. శాంతిసైన్యాలు నెహ్రూప్రభుత్వాన్ని తుడిచిపెట్టేసే సమయం సమీపిస్తోంది అని. కారాగృహంలోని రాజకీయఖైదీకూడా ఈ స్వాతంత్ర్యాన్ని వినియోగించుకున్నాడు.

విమర్శన ప్రభుత్వవ్యతిరేకంగా ఉండటం గురించి కొందరు కించపడవచ్చు, అందరూ దేశనాయకులను విమర్శిస్తున్నారే అని. కాని విమర్శనను నిషేధిస్తే కలిగే దుష్ఫలితాలకంటే, విమర్శనవల్ల వచ్చే కీడు చాలా తక్కువ. ఒకవిధంగా మేలే.

నిరంకుశత్వం - కార్మికవర్గానిదైనా, లేక పెట్టుబడిదారీవర్గానిదైనా - ఉన్న వ్యవస్థలో ఈ స్వాతంత్ర్యం లేదు. స్వతంత్రంగా, ప్రభుత్వాన్ని వ్యతిరేకించి విమర్శించేవారికి అక్కడ ఉన్న స్వాతంత్ర్యం. స్వాతంత్ర్యమల్లా నిర్బంధనా లేదా హత్య...ఆత్మహత్య. ఇతర విషయాలా నిరంకుశ వ్యవస్థలో సంతృప్తికరంగా ఉన్నా, అంటే కూలీలు బాగా ఉండవచ్చు, అందరకూ విద్యావసతులు ఉండవచ్చు, స్త్రీలకు పురుషులతోపాటు సమాన హక్కులుండవచ్చు. ఇన్నీఉన్నా, ఈఆలోచనా, వాక్స్వతంత్ర్యం లేకపోవటంబట్టి, సంఘం దృఢకాయుడైన మూఢునిలా ఉంటుంది. ఆరోగ్యం, బలం, చదువు, తిండి, గుడిసె అన్నీ ఉన్నయ్. కాని మనస్సుకు వికాసం లేదు. అంటే స్వయంగా గాని, బలవంతంగా గాని పశుప్రాయులుగా ఉండవలసివస్తుంది. నిరంకుశవ్యవస్థలోని పౌరులు.

ఈసందర్భంలో ఒక్క ముఖ్య విషయం గుర్తుంచుకోవాలి. మనుష్యుని ముఖ్య హక్కుల్లో మొదటిది మనోస్వాతంత్ర్యం.

ఒక్క మనోస్వాతంత్ర్యం ఉంటే ఏం లాభం ? తిండీ తిప్పలు లేవు. ఉండటానికి కొంప, గుడిసె లేవు. దారిద్ర్యంలో, అనారోగ్యంలో మనోవికాస మేమిటి ? అని. నిజమే. కాని ఈ మానసికస్వాతంత్ర్యమనే హక్కు ఉంటే, ఈ లోపాలను దిద్దుకోవచ్చు. ఈ హక్కు ఉంటేనే దిద్దుకోగలుగుతారు. దిద్దుకోగలుగుతున్నారు. ఈ మానసికవికాస, చైతన్యాలే దురన్యాయాలను నిర్మూలిస్తయ్.

ఒక్క విమర్శనాస్వాతంత్ర్యంమటుకు ఉంచి, మిగతారంగాల్లో సంకెళ్లు బిగించటం సంపూర్ణమైన ప్రజాస్వామ్యం కాదు, జీవితక్షేత్రమంతా ప్రజాస్వామ్యం వ్యాపించాలి. అందుకు ఈ విమర్శనాస్వాతంత్ర్యం దోహదపడుతుంది.

అయితే ప్రభుత్వాలకు, అధికారులకు ప్రజాక్షేమాన్నే లక్ష్యంగా పెట్టుకొని పనిచేయటమే కర్తవ్యమైనట్లు, ఈ విమర్శకులకుకూడా లక్ష్యం అనేది ఉండాలి. ఏదో వాళ్లు చేసినది కాదందాం, వాళ్లు చేసింది చెరుపు అందాం అనేది మాత్రమే విమర్శకుల లక్ష్యమైతే, తమకు లభించిన స్వాతంత్ర్యం ప్రజాభివృద్ధి కుపయోగపడక, దుర్వినియోగ మవుతుంది. సరిగా నిర్వహించినా, నిర్వహించకపోయినా యంత్రాలకు, అధికారులకు నెత్తిన బాధ్యత, పూచీ

అంటూఉన్నయ్. జనానికి ఆహారం, మందులు, చదువు, వగైరా ఏదో కొద్దో గొప్పో సమకూర్చవలసిన భారం వీరికుంది. కాని విమర్శకుల కాభారం నెత్తిన లేదు. మంత్రులు, అధికార్లు ఏమి మాట్లాడినా, చేసినా, ఫలితాలకు వారు బాధ్యులు. కాని విమర్శకుల కా బాధ్యత లేదు. బాధ్యతలేదు గదా అని ఇచ్చవచ్చినట్టు అయినదానికీ కానిదానికీ ప్రభుత్వాలమీద దుమ్మెత్తి పోసే దురాచారం త్వరలో ఏర్పడుతుంది. విమర్శకు లీ దురాచారానికి లోనకకుండా ఉండాలి.

విమర్శనా స్వాతంత్ర్యానికి ఇదే హద్దు. విమర్శ విమర్శకోసం కాదు. ప్రజల శ్రేయస్సుకోసం అనేదే హద్దు. ఈ హద్దులో ఉన్నంతవరకు విమర్శకు విలువ, ప్రయోజనం ఉంటయ్. ఈ హద్దును దాటితే, నిరుపయోగం కావటమే కాక, క్రమేపీ తాగుడుదుకాణంలా తయారవుతుంది దేశం. ఊరికే విమర్శిస్తూఉండటమే అలవాటయితే, ఎవడు మంత్రైనా, అధికారైనా, నాయకుడైనా వాడిని తూర్పారబట్టటం జరుగుతుంది. ప్రభుత్వం అన్నా, ప్రజాస్వామ్యంఅన్నా, ప్రజల్లో గౌరవం క్షీణిస్తుంది. ప్రజల్లో ఈ హీనభావం వ్యాపిస్తే, మళ్లీ అరాచకం, అశాంతి.

ఇప్పుడు కొంతమంది విమర్శకుల ధోరణి ఇలాగే ఉంటోంది.

కాంగ్రెసుప్రభుత్వాలను కాంగ్రెసువారు కాంగ్రెసునియమావళి ననుసరించి విమర్శించటం సబబు కాని వ్యతిరేకపక్షంవారిలా మాట్లాడటం అలవాటైపోయింది. మన రాష్ట్రంలో ప్రకాశంప్రభుత్వాన్ని రెండోముఠావాడు ఈసడించేవారు. రెండోముఠావారు గద్దెక్కాక ప్రకాశం వర్గంవారు ఆ సంప్రదాయాన్నే ఇంకెక్కువ జోరుగా అనుసరిస్తున్నారు. ఇది పార్టీశిక్షణకు విరద్ధం.

ఇక మిగతావారు. ఇప్పుడు మనరాష్ట్ర శాసనసభలోని వ్యతిరేకపక్షంలోవారు ఎక్కువగా జిన్నా అనుచరులు. పాకిస్తాన్ స్థాపనే వారి లక్ష్యం. కాని ప్రజల సాంఘిక ఆర్థికసమస్యలను వారెప్పుడూ మనస్సుకు పట్టించుకోలేదు. అయినా ఇప్పుడు మత పక్షంలోంచి ఒక్కమాటుగా ప్రజాపక్షంగా మారినట్టు ప్రవర్తిస్తున్నారు. ప్రజల్లో కిందితరగతులవారి ఉద్ధరణే తమ లక్ష్యమన్నట్టుగా మాట్లాడుతున్నారు.

ప్రభుత్వాన్ని తీవ్రంగా విమర్శిస్తున్నారు.

వీరి విమర్శ ఒకసూత్రాన్ని ఆధారం చేసుకొని ఉండదు. ప్రజల్లోని కింది తరగతుల ఉద్ధరణే లక్ష్యమంటూ, మద్యపాన నిషేధం వద్దంటారు. ఆ తరగతులవారి దారిద్ర్యానికి, అవినీతికి, సంస్కారహీనతకు మద్యపానం ఎక్కువగా కారణం. ఇప్పటి పరిస్థితుల్లో వాళ్లకు సరైన ఇళ్లు, బళ్లు, ఆసుపత్రులు కట్టించే అవకాశాలు ఏమీ కన్పించ్లేదు. అలాంటప్పుడు వారు సంపాదిస్తున్న ఆ తక్కువ కూలీడబ్బుఅయినా వాళ్ల అభివృద్ధికి తోడ్పడేట్టు ఉపయోగించాలా? లేక ఇంకా దరిద్రులై, ఇంకా అధములై, కృశించాలా?

వారి ఉద్ధరణే లక్ష్యమన్నవారు నిషేధాన్ని మరి ఎందుకు అడ్డగిస్తున్నారు? తమ విమర్శలవలన ప్రజల్లో కూడా నిషేధంపై గౌరవం తగ్గుతోందని వీళ్లు గుర్తించ్లేదు.

ఈ విమర్శ ఒక్క లీగుసభ్యులే కాదు. ఇతరులూ చేస్తున్నారు.

అత్యంతదరిద్రులైన ఈ అభాగ్యులను తాగుతో మత్తెక్కించి, వారి కుచేలసంపాదనల్లోంచి రు 17 కోట్లతో ప్రభుత్వపు బొక్కసాలను నింపాలనేవారే, పత్రికల వ్యాపారప్రకటనపై ప్రభుత్వం పన్ను విధిస్తామంటే, పత్రికలు పడిపోతాయ్ అని విమర్శించారు. పత్రికాధిపతుల ఆదాయాలను పోల్చిచూస్తే పన్ను లెవరికి ఎక్కువ కష్టం కలిగించేదీ బోధపడదూ?

అలాగే పెట్టుబడిదార్లిచ్చే పన్నులను ప్రభుత్వం తగ్గించాలని ఈవిమర్శకుల వాదన. పెట్టుబడిదార్ల ఆదాయాలను, మిగతా వారి ఆదాయాలను పోల్చిచూసే! 'ఉన్నవారు' ప్రభుత్వానికి తోడ్పడకపోతే 'లేనివారు' ఎలా తోడ్పడగలరు?

ఒక పక్కన ప్రజల్లోని దరిద్రుల ఉద్ధరణకు ప్రభుత్వం పాటుపడ్లేదంటూ, మరొకపక్కన ధనికుల పన్నులు తగ్గించాలంటే? ఎవరి ఉద్ధరణలక్ష్యం? లేని వారి శ్రేయస్సా? లేక ఉన్నవారికి ఇంకెక్కువ దోచిపెట్టటమా లక్ష్యం?

ప్రభుత్వం ప్రజలకోసం ఇంకా చేయవలసింది చాలా ఉంది. చేస్తున్నదాంట్లో లోపాలున్నయ్. ఈ విషయాలను విమర్శించటం వేరు. కాని ఒక పక్క ప్రజల విద్య, వైద్యం, గృహవసతి, ఆహారం, ఉద్యోగాల కోసం ప్రభుత్వం ఎక్కువ ఖర్చుపెట్ట్లేదంటూ, పన్నులు తగ్గించి, ప్రభుత్వఆదాయాన్ని తగ్గించుమని వాదిస్తే, ఫలితం? ప్రభుత్వాదాయం తగ్గితే, కార్యక్రమాలూ కుంటుపడతయ్.

అలాగే జమీందారీవిధానంగురించి. సైతాంగానికే భూమి చెందాలి అని ఒక

(35-వ పేజీ చూడుడు)



భారత రిపబ్లిక్ అధ్యక్షుడు. రాజేంద్రప్రసాద్ గారు మొన్న 6-వ తేదీన ఢిల్లీలో పారిశ్రామిక ప్రదర్శనమునకు ప్రారంభోత్సవం జరిపినారు.

# లాయక్ ఆలీ పరారి

## హైదరాబాద్ సమస్యా పరిష్కారావశ్యకత

హైదరాబాద్‌లో రజాకార్ల హయాంలో ప్రధానమంత్రిగా ఉన్న మీర్ లాయక్ అలీ హైదరాబాద్ నగరంలో పోలీసు నిర్బంధంనుంచి తప్పించుకుని పరారి అయినాడు. 1948 సెప్టెంబర్‌లో పోలీసుచర్య అనంతరం హైదరాబాద్ నగరంలో ఉన్న మంత్రులందర్నీ అరెస్టుచేసి వారివారి ఇళ్లలోనే నిర్బంధించి పోలీసుపహారా పెట్టారు. సంస్థానప్రజల్ని అమానుషంగా హింసించిన ఈ రజాకార్ మంత్రుల్ని వారి నేరాలను విచారించడానికి ప్రభుత్వం అవసరమైన సమాచారాన్ని సేకరిస్తోంది. పోలీసుచర్య జరిగి ఇప్పటికీ సంవత్సరన్నర గడిచిపోయినప్పటికీ ఇప్పటికి ఆ సమాచారాన్ని సేకరించడం సాధ్యపడలేదు. ఈ సమాచారానికి సంబంధించిన పత్రాలు అనేకం పరశురామప్రీతి అయినాయనీ, అనేకం దొంగిలించబడినాయనీ చాలరోజులుగా వదంతులున్నాయి. కొన్ని పత్రాలతో ఒక గూఢచారి పాకిస్తాన్ పారిపోడానికి యత్నిస్తుండగా జనవరిలో అతన్ని బొంబాయిలో అరెస్టుచేశారట. అతనివద్ద కొన్ని పత్రాలు దొరికాయి. అప్పుడే హైదరాబాదులో అనేకమంది పాకిస్తాన్ గూఢచారులు తిరుగుతున్నారనీ, వారేదో కుట్రపన్నారనీ తెలుసుకొని కూడా హైదరాబాద్ ప్రభుత్వం అజాగ్రత్తగా ఉండడం వింతగా ఉంది. పోలీసుచర్య అనంతరం సంస్థానంలో తిరిగి పూర్వ మహమ్మదీయపాలకులే ప్రబలమైన అధికారాన్ని ఆర్జించారని సంస్థానకాంగ్రెస్ నాయకులు కొందరు చెప్తూవచ్చారు. కాని భారత ప్రభుత్వంకాని, హైదరాబాద్‌లోని భారత ప్రభుత్వాధికారులుగాని వీరి మాటల్ని గమనించనైనా లేదు.

సంస్థానంలో మిలిటరీగవర్నర్ పరిపాలనను అంతమొందించాలని సంస్థానకాంగ్రెస్ విజ్ఞప్తి చేసినప్పుడు భారత ప్రభుత్వం మన్నించలేదు. భారతప్రభుత్వంపక్షాన హైదరాబాద్‌లో నియమితులైన అధికారులు అక్రమంగా ప్రవర్తిస్తున్నారని కొందరు ఫిర్యాదుచేసినప్పుడు ఫిర్యాదుచేసిన



మీర్ లాయక్ ఆలీ

వారినే నిందించారు. వదంతులలోనూ ఫిర్యాదులలోనూ సత్యాసత్యాలను విచారించడానికి యత్నమైనా జరగలేదు.

హైదరాబాద్‌లో వెంటనే ఎన్నికలు జరిపి సంస్థాన నాయకుల ఆధ్వర్యం కింద ప్రభుత్వం నిర్మిస్తేగాని కమ్యూనిస్టుసమస్యగాని తదితరసమస్యలుగాని పరిష్కారంకావని సంస్థానకాంగ్రెస్ నాయకులు చెప్తూవచ్చారు. కాని భారత ప్రభుత్వం ఎప్పటికప్పుడు ఈ సమస్యను వాయిదా వేస్తున్నది. సంస్థానంలో ప్రస్తుత పరిపాలనావిధానంపట్ల ప్రజల్లో కలుగుతున్న అసంతృప్తిని తొలగించడానికి భారత ప్రభుత్వం రవంతైనా కృషి చెయ్యలేదు.

సంస్థాన రాజ్యాంగపరిషత్సభకు ఎన్నికలు జరపడానికి మొదట నిశ్చయించారు. తరువాత వాయిదా వేశారు. భారత రాజ్యాంగపరిషత్సభలో హైదరాబాద్‌కు ప్రాతినిధ్యం ఇవ్వాలని నిశ్చయించారు. ఎవర్ని ప్రతినిధులుగా నియమించాలో అంగీకారం కుదరనికారణంపైన ఆ యత్నం మానుకున్నారు. ఈరీతిగా హైదరాబాద్‌లో ఎప్పటికప్పుడు అన్ని విషయాలలోనూ పరిష్కారాన్ని వాయిదా వేస్తూ వచ్చారు. అన్నిటికీ సంస్థానకాంగ్రెస్‌లోని కక్షలే హేతువులని చెప్తూవచ్చారు. కక్షల్ని పరిష్కరించడానికి యత్నాలు జరక్కపోలేదు. కాని పరిష్కారం కాలేదు. పరిష్కారం కానంతమాత్రాన అవసరమైన చర్యల్ని వాయిదా వెయ్యడం వలన మేలు కలక్కపోగా కీడే సంభవిస్తున్నది. నానాటికీ సమస్యలు విషమిస్తున్నవి.

కాంగ్రెస్‌లో కక్షలు భారతదేశంలో అన్ని ప్రాంతాల్లోనూ అనివార్యమైనాయి. అయినప్పటికీ రాష్ట్రాలలో ప్రభుత్వాలు నిర్వహించడంలేదా? కేంద్రప్రభుత్వంలో మంత్రివర్గంలోకూడా కక్షలుండగా, కక్షలవల్లనే ఇక్కడ ఎన్నికలు, ప్రజాప్రాతినిధ్య ప్రభుత్వాలస్థాపన వాయిదా వెయ్యడం అనుచితం.

సంస్థానంలో ప్రజల అసంతృప్తి వృద్ధి కావడంతోపాటు పరిపాలకుల పరపతి నానాటికీ క్షీణిస్తున్నది. పరిపాలకుల్ని మార్చవలసిన అగత్యం ఏర్పడింది. భారత ప్రభుత్వోద్యోగుల అండను పూర్వరజాకార్ పాలకులు తిరిగి తమ ప్రాబల్యాన్నేర్పరచుకున్నారని ప్రజల అభిప్రాయం. ఇప్పుడు హైదరాబాద్‌లో జరిగిన సంఘటననుబట్టీ, ఇతర విషయాలనుబట్టీ ఇందులో ఇంతో అంతో నిజంలేకపోలేదని తట్టుతుంది.

లాయక్ ఆలీ మార్చి 3 వ తేదీని పరారీ అయినట్లు హైదరాబాద్ ఉద్యోగులు

అంచనా వేస్తున్నారు. అంతకు ముందు రోజున అతన్ని చూసినట్లు పోలీసుపహారాదారు చెప్తున్నాడట. తరువాత 5 వ తేదీని పోలీసులు పరిశీలించగా లాయక్ అలీ నిద్రించేచోట నిలువునా తలగడలు పెట్టి పైన దుప్పటి కప్పబడిఉన్నదట.

ఆరోజున లాయక్ ఆలీ భార్య బంధువుల ఇంట వివాహము నే మిషతో కారులో వెళ్ళి తిరిగి రాలేదట. ఖాళీ కారు మధ్యాహ్నానికి తిరిగి వచ్చిందట. లాయక్ అలీ స్త్రీ వేషంతో బురఖాలో తప్పించుకు పోవడానికి అవకాశం ఉంది. పరదా వాసంలో తనిఖీకి తగిన బందోబస్తు చెయ్యబడలేదు. ఒక్క స్త్రీ మాత్రమే నియమించబడింది.

ఈపరారీలో ఇది ముఖ్యం కాదు. హైదరాబాద్‌లో అనేకమంది గూఢచారులు పాకిస్తాన్‌నుంచి వచ్చి కుట్రలు పన్నగలిగారు. లాయక్ ఆలీ మిత్రులు ఇద్దరు వారంరోజులకు ముందు పారిపోగలిగారు. గతసంవత్సరం బేగం రజ్వీ పారిపోయింది. లాయక్ ఆలీగూఢచర్యలు ప్రభుత్వానికి తెలుసును. లాయక్ ఆలీబంధువర్గంలో అనేకులు గూఢచారులతో కలిసినట్లు కూడా ముందే తెలుసును. లాయక్ ఆలీ పైనే రారోపణకు అవసరమైన కొన్నిపత్రాలు అంతర్థానం కావడానికి కొందరు సంస్థానోద్యోగులు, లాయక్ ఆలీ బంధువులు కారకులని సంస్థానంలో చెప్పుకున్నారు. కమ్యూనిస్టుల్ని అణిచే విషయంలో పోలీసుఉద్యోగులవలన అక్రమాలు జరిగాయని కొందరన్నారు. కాని ఇవన్నీ నిరాధారమైన వదంతులని త్రోసిపుచ్చారు. వీనిలో చాలవరకు అసత్యాలే కావచ్చును. కాని లాయక్ ఆలీ బంధువర్గంపైనా, ముఖ్యంగా బేగం లాయక్ ఆలీపైనా తగిన పహరా ఉంచకపోవడం పెద్దలోపం. బేగం తన ఆస్తిని అమ్మి ధనాన్ని ఎక్కడికో చేరవేసినట్లు వదంతులు వచ్చినప్పుడు, అమ్మకం సక్రమమైనదే అయినప్పటికీ, ఆంతర్యం కనిపెట్టవలసిన ఆగత్యాన్ని పోలీసులు గ్రహించలేదు. పాకిస్తాన్‌నుంచి అనేకులు వచ్చి విచ్చలవిడిగా తిరుగుతున్నప్పుడు అవసరమైన జాగ్రత్త వహించబడలేదు. ధనవంతులైన మహామ్మదీయులు కొందరు ఎప్పటికప్పుడు ధనాన్ని, వెండిబంగారులను పాకిస్తాన్ చేరవేస్తున్నట్లు ప్రబలవదంతులు వ్యాపిస్తున్నప్పుడు కూడా ప్రభుత్వం గమనించలేదు. ఈ కుట్రలన్నీ లంచగొండులైన కొందరు యూనియన్ ఉద్యోగులవల్ల సాధ్యమౌతున్నాయనికూడా సంస్థాన ప్రజల అభిప్రాయం.

లాయక్ ఆలీకుమారుడు కుమార్తెలు పది పదిహేనురోజులై విద్యాలయాలకు వెళ్లడం మానివేసినా పోలీసులు అనుమానించలేదు. లాయక్ ఆలీ ఇంటిలో పిల్లలు కానరానప్పుడుకూడా అనుమానించలేదు. ఇది స్పష్టంగా పోలీసుశాఖవారి అశ్రద్ధకు ఫలితం. అధికారంలో ఉన్న కొందరిమద్దతుతో ఈ కుట్రలు జరుగుతున్నాయనికూడా ప్రజల అభిప్రాయం.

పరారీ అనంతరం పూర్వనిజాం సైన్యాధిపతి అయిన ఎల్‌ఎద్రూస్‌ను అరెస్టుచేశారు. లాయక్ ఆలీబంధువర్గంలో కొందరినీ, పూర్వనిజాంప్రభుత్వోద్యోగంలో ఉన్నవారిని కొందరినీ అరెస్టుచేశారు.

మిగతా పూర్వమంత్రుల్ని గృహనిర్బంధాలనుంచి హైదరాబాద్ కేంద్రకారాగారానికి మార్చారు. లాయక్ ఆలీ పేరనున్న 20 లక్షల రూపాయల ఆస్తిని శరణార్థుల ఆస్తిసేకరణాధికారి వశం చేసుకున్నాడు. కాని ఇవన్నీ జరిగిన అపకారాన్ని తొలగించలేవు. ఇదివరకే ఈ జాగ్రత్త తీసుకోవలసింది. లాయక్ ఆలీ భారతదేశం దాటి గోవామీదుగా పాకిస్తాన్ చేరుకున్నట్లు రూఢిఅయింది. కాని భారత పాకిస్తాన్ ప్రభుత్వాల మధ్య ఒడంబడికననుసరించి లాయక్ ఆలీని ఒప్పగించాలని భారతప్రభుత్వం అడుగడానికి వీలుంది. కాబట్టి అతను ఈమాదిరి ఒడంబడిక భారతదేశంతో చేసుకొనని దేశానికి చేరుకోవచ్చును. ఈ పరిస్థితుల్ని చూస్తే ఈ విషయాల్ని, సంస్థానప్రభుత్వ: చర్యల్లోని లోపాల్ని విచారించవలసిన ఆవసరం ఎంతైనా ఉన్నదని తోచకమానదు.

హైదరాబాద్ పరిపాలనావిధానంలో మార్పు కూడా తేవలసిన అవసరం ఉన్నదని గోచరిస్తుంది. ఇంకెంతమాత్రం జాప్యం చెయ్యకుండా కాంగ్రెస్ నాయకులతో తాత్కాలిక మంత్రివర్గాన్ని నిర్మించాలి. సంస్థానంలోని నాయకులతో పరిపాలన నడుపుతూ, సార్వజనీననియోజకవర్గప్రాతిపదికపై ఎన్నికలు జరపాలి. ఈ ఎన్నికలద్వారా ఏర్పడిన రాజ్యాంగసభకే పూర్తిగా సంస్థాన భవిష్యన్నిర్ణయాన్ని విడిచిపెట్టాలి. ఎన్నికల సందర్భంలో సంస్థానభవిష్యన్నిర్ణయాన్ని ప్రధానాంశంగా చేసుకుని సంస్థానకాంగ్రెస్ తన కార్యక్రమాన్ని ప్రజలకు నివేదించాలి. ఈ నివేదికఆధారంపైనే ప్రజలు ఎన్నికల్లో పాల్గొని తమ అభిప్రాయాన్ని ప్రకటించగలరు. సంస్థానాన్ని భాషాప్రాంతాలుగా విభజించాలని ప్రజలు కోరినట్లయితే, భారతప్రభుత్వం వారి కోరికను పాటించాలి. సంస్థానాన్ని భాషాప్రాంతాలుగా విభజిస్తేగాని కమ్యూనిస్టుసమస్య, ఆర్థికసమస్య, రాజ్యాంగసమస్య పరిష్కారం కావని సంస్థాన కాంగ్రెస్ నిశ్చితాభిప్రాయాన్ని ప్రకటించింది.

కాంగ్రెస్‌లో కక్షల మిషను విడిచిపెట్టాలి. ఈరీతిగా సమస్యాపరిష్కారాన్ని ఎంతకాలం వాయిదా వేసినా కక్షలు పోవు. మిగతా రాష్ట్రాలలోకూడా కక్షలు పోయినప్పుడే, కాంగ్రెస్‌సంస్థనిర్మాణసమస్య పరిష్కరించబడినప్పుడే, హైదరాబాద్‌లో కాంగ్రెస్‌సమస్యకూడా పరిష్కారమౌతుంది. అందువల్ల భారతప్రభుత్వం తమ కారణాలన్నిటినీ మరిచి, హైదరాబాద్‌లో ప్రజాప్రాతినిధ్యపరిపాలనకు తక్షణమే ఏర్పాటుచేయాలి. ప్రజలపట్ల ద్రోహం చేసిఅమానుషంగా ప్రవర్తించిన రజాకార్ నాయకుల నేరాల్నీ సంస్థానంపట్ల ద్రోహం తలపెట్టినవారినీ విచారించి శిక్షించవలసినవారు ప్రజాప్రతినిధులు.

[సీతారామ్]

---

సినీమా:

# లక్ష్మమ్మ



శోభనాచల అండ్ ఎం. ఆర్. ఏ. వారి 'లక్ష్మమ్మ' ప్రివ్యూ మొన్న గురువారం ఉదయం ఇచ్చారు. త్రిపురనేని గోపీచంద్ గారు ఈ ఫిల్ముకు కథ, సంభాషణలు వ్రాసి, దర్శకత్వంకూడా నిర్వహించారు. నారాయణరావు, కృష్ణవేణి నాయక నాయికాభూమికలను, కుమారి రుక్మిణి, లింగమూర్తి, గోవిందరాజుల సుబ్బారావు, డి. హేమలత ఇతరముఖ్యపాత్రలను నిర్వహించారు. పాటలు 'తారానాథ్' నాట్యాలు వెంపటి సత్యంగార్లు కూర్చారు. సంగీతదర్శకత్వం ఘంటసాల వెంకటేశ్వరరావుగారు నిర్వహించారు. ఛాయాగ్రహణం ఎం. ఏ. రహిమాన్, శబ్దగ్రహణం ఎం. వి. వాల్స్ చేశారు.

స్థితీ, పరువూ గల దిగుమర్తి, చిరుమామిళ్ళ వంశాలు వియ్యమందడానికి కారకురాలై, ఉద్రేకవశాన అపమార్గాన పడ్డ భర్తఅనాదరానికీ, మాటపట్టుదలపై అత్తా, ఆడబిడ్డల ఆగ్రహానికీ ఆరళ్ళకూ గురిఅయి అనుమానగ్రస్తుడైన పెనిమిటి చేతులలో ప్రాణాలు కోల్పోయి, దేవతై వెలసిన పతివ్రత లక్ష్మమ్మచరిత్ర ఈ ఫిల్ము ఇతివృత్తం.



విజయా ప్రొడక్షన్సు వారి 'షావుకారు'లో [illegible] చాకచక్యంతో నిర్వహిస్తున్న ఎస్. వి. రంగారావు.

లక్ష్మమ్మపాత్రను కృష్ణవేణి, భర్త వెంకయ్యనాయుడుభూమికను నారాయణరావు చాలా నేర్పుగా నిర్వహించారు. ఈ రెండు పాత్రలూ అపారమైన మనస్సంక్షోభం పొందేటట్టివి. దానిని సన్నివేశాలు, సంభాషణలద్వారా సృష్టించటంలో కథకుడు, వ్యక్తీకరించటంలో వీరూ చూపిన నైపుణ్యం అద్భుతం. స్థితిమంతులు, పరువు ప్రతిష్ఠలు, తమ తమ ఊళ్ళలో పెద్దరికం గల [illegible]సలప్పనాయుడు (లక్ష్మమ్మ తండ్రి), సుబ్బానాయుడు (వెంకయ్యనాయుడు అన్న) పాత్రలు ధరించిన గోవిందరాజుల సుబ్బారావు, ముదిగొండ లింగమూర్తి తెలుగుదేశంలో పూర్వకాలంలో పెద్దమనుష్యులు పలుకులో, మన్ననలో, చేతలో, ఎంత హుందాతనం చూపేవారో కళ్లకు కట్టించారనవచ్చు. వెంకయ్యనాయుణ్ణి లక్ష్మమ్మలాగే మనస్ఫూర్తిగా ప్రేమించిన దేవదాసి రాధ పాత్ర ధరించిన కుమారిరుక్మిణి, నటన, నాట్యాలు రెంటిలోనూ [illegible]కింది. లక్ష్మమ్మ ఆడబిడ్డ పిచ్చమ్మవేషం వేసిన హేమలత, వదినగారిపై కపటానురాగం కనపరిచే దృశ్యంలో నటనానైపుణ్యం చూపింది.

గోపీచంద్ గారి సంభాషణలు జుగుప్స కలిగించే సినిమాసంభాషణలతో దెబ్బతిని పడివున్న తెలుగు చెవులకు జానపదులనుడికారపుసొంపుతో ఇంపు కూరుస్తున్నాయి.

ఆయనదర్శకత్వంలో ఫిల్మం ఆవేగంతో పరుగులెత్తింది అనజాలము. నాయకుడు అనుమానంతో తపనపడుతూ తాను ఇంట్లో వుండగా [illegible], లక్ష్మమ్మకు పూనకం వచ్చిన [illegible] దృశ్యం, వెంకమ్మ కొడుక్కు కబురంపే సందర్భంలో [illegible] దృశ్యము, తిరిగి వాడు వచ్చి చెప్పే దృశ్యము రెండూ తొలగించినట్లయితే ఫిల్మం ఆసాంతం సమవేగంతో సమస్థాయిని నడిచేది. కథ నిజంగా జరిగినదికాబట్టి ఆ దేశకాలపరిస్థితులతో కథకు సహజవాతావరణాన్ని [illegible]గా సమకూర్చినట్లయితే ఫిల్ము ఇంకా ఎంతో రక్తికట్టేది.



ధాన్యపు కంకులను కోయుచున్న యంత్రం.



పంట కోతకు వచ్చినదీ లేనిదీ పరీక్ష

# అమెరికాలో యాంత్ర



నూర్పుడు యంత్రం ట్రక్కులో పోసిన ధాన్యాన్ని సర్దుకుంటున్న రైతు.

యంత్రాలతో వ్యవసాయం మొదలెట్టటంవల్ల, అమెరికా, రష్యాలు, నేడు ప్రపంచమంతటిలోకీ ఎక్కువగా ధాన్యరాసులు పండిస్తున్నయ్. యంత్రవ్యవసాయానికి అతి విస్తృతమైన భూభాగమూ, యాంత్రికంగా పెద్దపెట్టున పెట్టుబడి సౌకర్యాలూ ఉంటేతప్ప ఈ విధానం ఉపయోగించను. అమెరికాలో ధనికరైతులు ఎక్కువగాబట్టి ఈ విధానం అవలంబించగలుగుతున్నారు. రష్యాలో ప్రభుత్వమే ఈపనికి పూనుకొన్నది. మనదేశంలాంటి దేశాలలో, ఇటూ అటూ కాకుండా ఉండడంవల్ల, యాంత్రికవిధానం అవలంబించి దేశాన్ని స్వయంపోషకం చేసుకోటానికి ఆరంభమే కుదరటంలేదు. గ్రామసహకార సంస్థావిధానాలు నెలకొనగలిగితే గ్రామము గ్రామమూ, ఒక్కొయూనిట్టిగా ఈయాంత్రికపద్ధతుల నవలంబించి అధికాహారోత్పత్తి సాగించవచ్చును. ఈ విధానంలో పంట ఎక్కువగా పండించి జాగ్రత్తపరచటం. చిత్రాలవల్ల సుబోధకమౌతుంది.



గోధుమ మామూలు-కోతా, నూర్పిడీ ఒకేదఫా నిర్వహించుతూన్న మరోయంత్రం ప్రక్కనున్న మోటారుట్రక్కులోకి ధాన్యాన్ని కుమ్మరించుతున్న దృశ్యం.



గోధుమ మామూలు-కోతనూర్పిడీ, ఒకేదఫా నిర్వహించుతున్న యంత్రం. గోధుమలు ప్రక్కనున్న తొట్లోకి కుమ్మరించేస్తోంది.

# కవ్యవసాయవిధానం





ధాన్యపు గరిసెలు.

గరిసెలలోనుంచి ధాన్యాన్ని వివిధప్రాంతాలకు చేరవేస్తున్న మోటారుట్రక్కులు.

# ★ గ్రంథ సమీక్ష ★

## పరమాణు గాథ
### లేక ATOM BOMB

కర్త: శ్రీ కామరవోలు వెంకటసుబ్బారావు. B.A. వెల: 10-0-0; ప్రాప్తిస్థానం వెంకట్రామా అండ్ కో., సికింద్రాబాద్.

1945 లో ఆటంబాంబులు పేలినప్పటినుంచీ రాజకీయంగానూ, వైజ్ఞానికంగానూ, నైతికంగానూ పరమాణుశక్తికి ప్రథమస్థానం వచ్చింది. బ్రహ్మాండమైన ఎత్తులో మారణహోమం చేయగల ఈ శక్తిని సాధించటం, ప్రయోగించటం, పెంపొందించటం అనే పనులను ఎట్లా సాధించారా అనే కుతూహలం శాస్త్రజ్ఞులనే కాక సాధారణ ప్రజలనుకూడా పీడిస్తున్నది. ఇటువంటి ఆయుధం అమెరికాచేతిలో ఉండటంవల్ల ప్రపంచరాజకీయాలలో చెప్ప నలవికాని భయసందేహాలు, అత్యుత ప్రబలి స్థిమితం తప్పిపోయింది. అసలు ఈ ఆయుధాలను ప్రయోగించటం సమర్థనీయమేనా? ఈ ప్రయోగం వల్ల ప్రపంచంలో పశుశక్తికి ప్రాధాన్యత లభించి నైతికదృక్పథం నిరాదరణగురి కాదా? అని ఈవిధంగా మీమాంస బయలుదేరింది.

ఈ ప్రశ్నలన్నిటికీ సమాధానం ఇవ్వటానికి ఈ పుస్తకం ప్రయత్నిస్తున్నది. దీని విషయమై ఇంతవరకూ సమగ్రమైన గ్రంథాన్ని రచించటానికి జరిగిన మొదటి ప్రయత్నం ఇదే.

ఇందులో అసలు గ్రంథం 457 పేజీలు (9 అధ్యాయాలు) ఉన్నవి. ఇవి కాక 5 అనుబంధాలు, అవసరమైన బొమ్మలు, చిత్రాలు ఉన్నవి. గ్రంథరచనలో తోడ్పడ్డ ముఖ్యగ్రంథాల పేర్లు, ముఖ్యశాస్త్రజ్ఞుల పేర్లు, సాంకేతికపదాలు, వాటి వివరణ అన్నీ ఇవ్వబడ్డవి. 1947 లో మద్రాసు విశ్వవిద్యాలయంవారు ఈ విషయంమీద ఉత్తమగ్రంథాన్ని వ్రాసినవారికి 700 బహుమానం ఇస్తామనగా ఇది వ్రాయబడ్డదికాని దురదృష్టవశాత్తు పోటీలో పరిగణించటానికి వీలులేకపోయింది.

ప్రాచీనభారతదేశంలో చార్వాక, బౌద్ధ, వైశేషిక, న్యాయ, దర్శనములు పరమాణువాదాన్ని అంగీకరించినవి. అందులో భిన్నమతాలవారు ప్రతిపాదించినసూత్రాలు, శంకరుడు బౌద్ధులవాదాన్ని ఎదిరించి అద్వైతవాదాన్ని స్థాపించటం ఈ అంతా ఇన్నీ ద్రవ్యోత్పత్తిపరంగా ఈ గ్రంథంలో వివరించబడినవి. పాశ్చాత్యులు ప్రయోగ ప్రమాణాల ననుసరించి సాధించిన సిద్ధాంతాలు ప్రాచీన భారతీయసిద్ధాంతాలతో ఎట్లా సరిపోలుతున్నవో విశదం చేయబడ్డది.

మొదటి అధ్యాయంలో భారతీయ సిద్ధాంతాలు వివరించబడ్డవి. అది చదువుతూ ఉంటే కపిలుడు, గౌతముడు, వాత్స్యాయనుడు, కణాదుడు, మొదలైనవాళ్లు ప్రధానంగా వైజ్ఞానికులే నని తోచక మానదు. రెండో అధ్యాయంలో గ్రీకులకాలంనుంచీ పరమాణుజ్ఞానం ఏవిధంగా అభివృద్ధి చెందిందీ - ప్రయోగ ప్రమాణాల ననుసరించి - వివరించబడ్డది. విద్యుచ్ఛక్తికీ, పరమాణువుకీగల సంబంధం విపులంగా చెప్పబడ్డది. మూడో అధ్యాయంలో పరమాణువులో ఉండే భాగాలు, వాటి స్వభావం, కాంతికి పరమాణువుకు గల సంబంధం చెప్పబడ్డది. 'గామా' కిరణాలు, విశ్వమయూఖాలు మొదలైన కిరణప్రసారం బోధించబడ్డది.

నాలుగో అధ్యాయంలో పరమాణు నిర్మాణం తెలుసుకొనటానికి చేయబడ్డ పరిశోధనలు వర్ణించబడ్డవి. అందులో ద్రవ్య పరివర్తనా (స్పర్శవేది) న్ని గురించి కూడా చెప్పబడ్డది.

అయిదో అధ్యాయం పరమాణుస్వభావ తత్వాలకు సంబంధించిన మూలసిద్ధాంతాలను వివరిస్తున్నది. ద్రవ్యం శక్తిగానూ, శక్తి ద్రవ్యంగానూ ఎట్లా మారేదీ, ప్లాంక్, డీబ్రోలీ, డిరాక్, హైసెన్‌బర్గ్, ఆండర్సన్, ఐన్‌స్టయిన్, బోర్ మొదలైన శాస్త్రజ్ఞుల సూత్రాలన్నీ వివరించబడినవి. ఆరో అధ్యాయంలో అణు గర్భశకలు, ద్రవ్యంలో అవాంతరభేదాలు (ఐసోటోప్స్), అణుశక్తికీ అయస్కాంతశక్తికీ గల సంబంధం చెప్పబడ్డది.

ఏడో అధ్యాయంలో అణుగర్భచ్ఛేదనం వర్ణించబడ్డది. అణువాస్త్రం, దాని నిర్మాణంలో గల సాధకబాధకాలు, అందులో అంతశక్తి ఉండటానికి గల కారణాలు, ఇప్పటికి అమెరికా తయారుచేసిన 5 బాంబులు విపులంగా వర్ణించబడ్డవి. ప్రస్తుతం తెలుస్తున్న వివరాలనుబట్టి ఆటంబాంబు ఎట్లా ఉంటుందో సూచిస్తూ ఒక మంచి బొమ్మకూడా జతచేయబడ్డది. ఎనిమిదో అధ్యాయంలో పరిశ్రమలకు అణుశక్తిని ఉపయోగించటానికి గల అవకాశాలు చెప్పబడ్డవి.

తొమ్మిదో అధ్యాయం జడశక్తికీ ప్రాణశక్తికీ గల సంబంధం, సాపేక్షవాదం అద్వైతవాదం, విశ్వసృష్టిపరిణామాలు మొదలైన వాటినిగురించి చెపుతున్నది.

తొమ్మిదో అధ్యాయంలోనే సాంఘిక, రాజకీయ, అంతర్జాతీయపరిస్థితుల మీద పరమాణుప్రభావం చర్చించబడ్డది. ఈ చర్చలో రచయిత అమెరికా ఆటంబాంబులను ప్రయోగించటం నేరమనీ, రష్యాకు పైచేయివస్తుందన్న భయంతో చేసినపని అది అనీ అంటున్నాడు. ఆభయంచేతనే, రష్యా ఆటంబాంబులను సాధించక ముందే దానిని సర్వనాశనం చేద్దామని అమెరికన్లు ఆలోచిస్తున్నారని సోదాహరణంగా ఆరోపించాడు. ఆయనచూపించిన కారణాలనులేదని నిరూపించటం చాలకష్టం.

పరమాణురహస్యాలను తెలుసుకొనటానికి అవసరమైన శాస్త్రవిషయాలన్నిటినీ ప్రాథమికసూత్రాలదగ్గరనుంచీ చెప్పటానికి ప్రయత్నించిన గ్రంథకర్త అభినందనీయుడు. కాని ఆధునికవిజ్ఞానశాస్త్రంతో స్వల్పపరిచయమయినా లేకపోతే, విషయాన్ని అవగాహనచేసుకొనటం కష్టం. సాంకేతికపదాలకాఠిన్యాన్ని చూసి బెదిరిపోకుండా ఉంటే ఈగ్రంథం సాధారణులకు కూడా ఉపయోగిస్తుంది. ఆధునికవిజ్ఞానశాస్త్రంతో పరిచయం గలవాళ్లు సద్భావంతో చదివితే అనేకవిషయాలను తెలుసుకొనటమే కాక, భారతీయవిజ్ఞానస్వరూపం కూడా తెలియగలదు.

భాష బాగా నే నడిచింది కాని సంస్కృతంపాలు కొంత తగ్గించవచ్చునేమో!

ఆధునికవిజ్ఞానం ప్రజలకు ఉపయోగపడాలనీ, విశ్వవిద్యాలయాల్లో కూడ మాతృభాషద్వారానే విద్యాబోధన చేయాలని ప్రయత్నాలు జరుగుతున్నవి కనుక, ఇటువంటి రచయితలను ప్రోత్సహించటం చాలా అవసరం.




# భూమిం పుట్టుక

శ్రీ మద్దుళ్ళవారి రామకృష్ణ

అసంగసంగా పర్షియాదేశంలో ఫహిల్‌మా నొకడుండేవాడు. అతని కీర్తి నేలనాలుగుచెరగులా వ్యాపించింది. ఒకనాడొక దేశదిమ్మరి సంచారం చేస్తూ యీదేశం చేరాడు. ప్రతిదేశంలో ప్రఖ్యాతమైనవాటిని చూడటం రివాజు. అలాగే యీదేశపు పేరు గాంచిన ఫహిల్‌మానును దర్శించాడు. చూచినవాడు గుమ్మనని వూరుకోక నీకన్న గొప్పవాడిని ఇండియాలో చూచానన్నాడు. ఫహిల్‌మానుమనస్సు చివుక్కుమన్నది. తన గొప్ప మొక్కపోతుందని కించపడ్డాడు. వెంటనే యిండియా వెళ్ళి వాడిని జయించి తన పేరుప్రతిష్ఠలు ప్రపంచమంతా చాటదలచాడు. వెంటనే బజారు కెళ్ళి లక్షపౌనుల గోధుమపిండి కొని మూటగట్టి నెత్తిన పెట్టుకొని కాలికి బుద్ధిచెప్పాడు.

వాలుగాలిలో వేగంగా ఇండియాసరిహద్దుల్లో నున్న ఒక పెద్ద సరస్సువొడ్డుకు చేరాడు. ఆకలయింది. నాలుక పిడుచకట్టింది. సరస్సులోని నీటిమీద కొరగి వొక గుక్క పీల్చాడు. సరస్సు సగమైంది. మిగతానీటితో పిండి కలిపి రొట్టె చేసికొని తిన్నాడు. భుక్తాయాసంతో గాఢనిద్రలో బడి గురకలు పెట్టాడు.

వాడుకచొప్పున నీరు త్రాగటానికి రోజూ వచ్చే యేనుగొకటొచ్చి చూచింది. సరస్సు వట్టిపోయింది. దాపులో వెయ్యిమైళ్లలో



యెక్కడా నీరు దొరకదే? యేమి చెయ్యాలని తొండ మాడించసాగింది. ఏమిచెయ్యటానికి పాలుపోక తేరిపారజూచింది. తిరుగుముఖం పెట్టింది. తనకన్నా 'పెద్ద జంతువు మరొకటి సుఖంగా సరస్సువొడ్డు తలగడగా పెట్టుకొని మైమరచి గాఢనిద్ర పోవటం కంటికి కనుపించింది. కోపంతో ఘీంకారము చేసింది. గట్టిగా నిద్రపోయేవాడి మాడుమీద బాదింది. చీమ ప్రాకినట్లుగా తోచిం దాతనికి - చెయ్యి పైకెత్తి యేనుగును గుప్పిట్లో గట్టిగా పట్టుకున్నాడాతడు. ప్రింగేద్దామనుకున్నాడుగాని తరువాత దారిలో దానిపని చెప్పదాములే యని దుప్పట్లో దాన్ని మడచి చంక పెట్టుకొని ఇండియాకు బయలుదేరాడు.

పదిపన్నెండంగల్లో ఇండియా ఫహిల్‌మాన్ యిల్లు చేరాడు. పెద్దగా కేకవేసాడు. "రావోయ్! మొనగాడా! నాతో కుస్తీ పట్టటాని" కద్నాడు అప్పుడతడింట్లో లేడు. "అడవి కెళ్ళి కట్టెలు తీసికొనిరా వెళ్ళినాడని" సిగ్గుతో వంచిన తల యెత్తక వాడి పెళ్ళాము జవాబు చెప్పింది.

అచ్చా! నేను మళ్ళీ వస్తా. ఇదుగో యీ కానుక మీ ఆయనకో

సం తెచ్చానని ఆ యేనుగును గోడ మీద నుంచి వాళ్ళ దొడ్లోకి గిరాటు వేసాడు.

అత్తా! అత్తా!! ఒక పోటీగాడు నీ కొడుకుమీదికి తొడచరుస్తూ వచ్చాడు. అత డింట్లో లేడంటే ఒక ఎలుకపిల్లను లోనికి గిరాటువేసి మళ్ళీ వస్తానని చెప్పి వెళ్లాడు.

"ఫరవాలేదులే, ఆ యెలుకను చూచి దడుచుకుంటున్నట్టుందే, ఒక బోను పెట్టి దాన్ని పట్టి అవతల పారేద్దాములే" అన్నది ఫహిల్ మానుతల్లి.

గోడవద్ద పొంచియున్న పర్షియా ఫహిల్ మాన్ యిదంతా విన్నాడు. వాడి పెళ్లానికి యేనుగొక యెలుక పిల్లగా కనుపిస్తుంటే నేనెట్లా వుంటానో ఆ ఫహిల్ మాను చూపుల్లో ననుకొని ధైర్యం చిక్క బట్టుకొని కానున్నది కాకమానదని కట్టెలకోసం వెళ్ళినవాడిని వెతక వెళ్ళాడు పర్షియాఫహిల్ మాన్.

నాలుగైదంగల్లోనే ఎదురు పడ్డాడు ఇండియాఫహిల్ మాను - వెయ్యిబండ్లకట్టెలు నెత్తిన పెట్టుకొని నిజంగా సరియైన జోడా యనుకొని అతన్ని పిలిచాడు. ఏమోయ్! నీ గొప్ప వినే పర్షియానుంచి నీతో కుస్తీపట్టటానికి కుతూహలంతో వచ్చాతయారేనా" అని కేకేశాడు.

సంతోషం - ఆలాగే "అందరూ చూచేట్లు వూళ్లో కెళ్ళి పట్టుదాము. నీ జగజెట్టిగాడితనం చూచి అందరూ ఆనందిస్తా రన్నాడు ఇండియా వస్తాదు.

ఆలస్యం చేయడానికి వీలులేదు. వీలైనంత వేగంగా నేను పర్షియా తిరిగి వెళ్ళా లన్నాడు. "చూచే వాళ్ల కేమిలే, ఆ వూగుతూ పోటేసు కొని పోయే ముసలమ్మను పిలుద్దాములే"అని అ ముసలవ్వను అవ్వా! ఓ అవ్వా!! ఓ ముసలవ్వోయ్!!! మా కుస్తీ చూద్దువుగానిరా!" అని పిలిచారు. నా కొల్లగాదు! నా కొల్లగాదు!! మా పిల్ల వంటెలను తోలుకొని పారిపోతున్నది. దాన్ని పట్టుకొని లాక్కురాపోతున్నా నేను చూడాలని అంతకోరికగా వుంటే నా అరచేతిలో నిలుచొని పోరాడు తుండండి. నేను పోతూపోతూ మీ కుస్తీ చూస్తుంటా. ఇష్టమయితే అట్లా చేయం డన్నది.

కుస్తీగాళ్ళిద్దరూ అవ్వ అరచేతి మీదికి దూకారు. చేతులు చేతులు కలిపారు. పట్లు పట్టుతున్నారు. అవ్వ కఱ్ఱవేసికొంటూ కూతుర్నీ, వంటెల్నీ, వెదకటానికి, కొండల్లో లోయల్లో, మైదానాల్లోకి తేరిపార జూస్తూ చల్లగా పోతున్నది.

పోగా, పోగా కాసేపటికి అవ్వ, రావటం కూతురు చూచింది. అవ్వచేతిలో బలమైన యోధులు కుస్తీపట్టటం చూచి మొదట భయపడ్డది. ఆమెను పట్టుకొంటాని కిద్దరు సైనికులను పట్టుకొస్తున్న దనుకుంది. దగ్గరకు రానిచ్చింది. వాళ్లు ఆపిల్ల కంటికి నలుసుల్లా గున్నారు. కుస్తీ పట్టేవాళ్ళిద్దరినీ ఒక్క గుప్పెట్లో పట్టుకొని, అవ్వను, వాళ్ళను 160 వంటెల్ని కలిపి ఒక మూట కట్టి నెత్తిన పెట్టుకొని బయలుదేరింది జైత్రయాత్రకు.

దారిలో ఒక వంటెకు ఆకలై మూటలోనుంచి తల బైటపెట్టి అరుస్తున్నది. అవ్వకూతురు నెత్తిమూట దించకుండానే పోతూ, పోతూ ప్రక్క నున్న ఒకటిరెండు పెద్దచెట్లు పీకి దాని నోట్లో మేత కుక్కింది.

ఇదంతా చూచిన ఒక రైతు దొంగ! దొంగ!!" అని కేకేశాడు. వాడి అరుపుతో ఆపిల్లకు కోప మొచ్చింది. రైతును, వాడి పొలాన్ని ఎద్దుల్ని, గుఱ్ఱాలను, నాగళ్లను, కలిపి దుప్పట్లో మూటగట్టి పరుగెత్త సాగింది. ఒక నగరం చేరింది. పొట్ట లోని యెలుకలు గలగల లాడసాగినవి. ఆకలి నకనక లాడింది. అక్కడున్న రొట్టెల దుకాణం, ఆ నగరాన్ని కలిపి తన మూటలో కుక్కి తిరిగి కాలికి బుద్ధిచెప్ప సాగింది.

కట్టకడపటికి ఒక పొలం సమీపించింది. అక్కడొక పెద్ద పుచ్చకాయ చూచింది. దప్పి కగుతుంది. దాన్ని రెండుగా చేసి లోని గుజ్జు తిని కాయ తొక్కలో తన మూట కప్పిపెట్టి తలకింద పెట్టుకొని నిద్రకు పడ్డది.

కునుకు కాస్త పట్టిందో లేదో దాపు నున్న సముద్రం పొంగొచ్చింది. తొక్క, తొక్కతో బాటు పిల్ల వరదలో కొట్టుకపోయింది. ఒకచోట లంక పెట్టింది. మూటూడిపోయింది. అవ్వ, ఫహిల్ మాన్లు, వంటెలు, చెట్లు, రైతు, ఎద్దులు, గుఱ్ఱాలు, నాగళ్లు, రొట్టెలుచేసేవాడు, జనం నగరంలో వుండే వస్తువులన్నీ బయట పడ్డవి. అట్లా మన ముండే ప్రపంచం పుట్టిందని ముల్కురాజ్ ఆనంద్ కు వాళ్ళవ్వ చెప్పిందట.

---

బాలానందం:

# రాజు-గొల్లనాయకుడు

శ్రీమతి ఏకా జయలక్ష్మి

పూర్వకాలం హరిపూర్ రాజ్యాన్ని కృష్ణవర్మ అనే రాజు పరిపాలించుచుండెను. అతని రాజ్యములో ధర్మము నాలుగుపాదములు నడచుచుండెడిది. రాజ్య పరిపాలనలో చూపే చాకచక్యం, ప్రజలయందు చూపే న్యాయం అంతటి ధర్మమూర్తి మరొకడు లేడన్న కీర్తిని తెచ్చినవి. రాజఉద్యోగులు, మంత్రులు తమతమ పదవులనుంచి విరమించుకొనే తరుణం సంభవించినపుడు వారికి అగ్రహారాలు, ధనాన్ని బహూకరిస్తూ ఉండేవాడు. తన విశ్వాసపాత్రుడైన మంత్రికి విరామకాలం ఆసన్నమయింది.



అతడు పదవిని వదలిపోయే సమయంలో రాజు అతని పరిపాలనా దక్షతకు, వినయవిధేయతలకు మెచ్చుకొని హరిపూర్ సరిహద్దులో ఉన్న గ్రామాన్ని అతని సేవకు కాన్కగా ఒసంగెను. ఆ గ్రామస్థులకు విజ్ఞానబిక్ష పెట్టి, ఆరోగ్యసూత్రము, ప్రభోదించి వారి జీవిత పద్ధతిని సరియైన మార్గమునకు త్రిప్పి వారు ఆనందముగా, సుఖంగా జీవించేవిధంగా తయారు చేయగల్గాడు. తన అనన్యకృషివలన చిన్న గ్రామాన్ని పెద్దపట్టణంగా మార్పు చేశాడు. అది దినదినాభివృద్ధి గాంచుచు స్వతంత్రరాజధానిగా ఏర్పడింది. దానికి 'మునిపూర్' అని నామకరణం చేశాడు.

కొన్ని సంవత్సరాలు గడచినది. ఇంతలో హరిపూర్ రాజు మరణించటం సంభవించింది. అతనికి ఒక్కడే కొడుకు అతడు శాస్త్రాలో ఆరితేరాడు. పరిపాలనావిషయాల్లో తండ్రిని మించినవాడు. తండ్రిఅనంతరం కొడుకు రాజైనాడు. పేరు విక్రముడు. దేశాన్ని పర్యటించి ప్రజల కష్టసుఖాలను తెలుసుకోవలెనని తన కోరికను మంత్రులకు తెలియజేశాడు. కాలం మారింది. మునిపూర్ పరిపాలకుడు గతించటం తారసిల్లింది. అతనికి ఒక్కడే కొడుకు. పరిపాలన తెలియదు. భాషాజ్ఞానము లేనివాడు. కొడుకు తెలివితేటలు శక్తిసామర్థ్యాలు అనుభవంమీద అర్థంచేసుకున్నాడు. కనుక కొడుకును దగ్గరకు పిలచి "పరువు మర్యాదలతో ప్రవర్తించి ప్రజల మన్నన పొంది నా పేరు సార్థకము చేయవలసిందని తన తుది సందేశాన్ని అందించి కళ్ళుమూశాడు. అధికారాన్ని స్వీకరించినపిదప తండ్రిమాటలు మరచిపోయి ప్రజల ప్రేమాతిశయాలను పొందలేక అసమర్థుడని పేరు గాంచెను.

హరిపూర్ ప్రభువు దేశాటనకై బయలుదేరాడు. మంత్రులు సామంతులు, సేవకబృందము వెంట

రాగా గుఱ్ఱంమీద తన ముఖ్య పట్టణపరిహద్దులు దాటి లోయలో గుండా పోతూ అభివృద్ధి నొంది, నవనవోదయముగా కళకళ లాడు ఒక పట్టణము గాంచెను. తన రాజధానీనగరమునకన్నా ఎన్నో రెట్లు ఉచ్ఛ్రాయదశ అనుభవిస్తూ, విశాలమైన వీధులతో, బారులు తీర్చిన గృహాంగణములతో చక్కని నీటి సదుపాయములు గల్గి, లెక్కకు మిక్కిలిగా ఉన్న ఉద్యానవనములతో సొంపుమీరి యింపు విరాజిల్లుట గాంచి ఆశ్చర్యచకితుడై ఈ పట్టణపరిపాలకు డెవరు? దీని పేరేమి? అని తనవెంట వచ్చువారిని ప్రశ్నించాడు. వారిలో ఒకడు "రాజా! ఈపట్టణం మీ తండ్రిగారు పూర్వపు మంత్రికి అతని సేవానిరతికి కానుకగా బహూకరించిన ఒక పల్లె అని దానిపేరు మునిపూర్ అని తెలియ జేశాడు. అయితే! ఇది నా రాజ్యంలో భాగమేనా? అని ప్రశ్నించాడు తిరిగి.

అతని అనుచరబృందము ఈ ప్రశ్నకు తృప్తికరమైన సమాధానము ముట్టజెప్పలేకపోయిరి. అందువలన రాజు తనంతట తనే అసలుసంగతి తెలుసుకోవలె నని ప్రయత్నించెను. లోయలోగుండా పట్టణంలో ప్రవేశించాడు రాజు. పట్టణద్వారసమీపమున పెక్కుమంది గుమిగూడి ఉన్నప్పటికీ అతనిని గౌరవించి పిలచి తలచిన వాళ్ళు గోచరించలేదు. సామాన్య వ్యక్తికి లభించే ఆదరణ రాజు పొంది ఆశ్చర్యపడ్డాడు. ఒక యింటి అరుగుమీద కొందరు పెద్దలు గుమిగూడి పొగ త్రాగుతూ కులాసా కబుర్లతో తెలియని ఆనందాన్ని అనుభవించటం రాజు చూశాడు. వారిని రాజు సమీపించి దీని పరిపాలకు డెవరు? అని ప్రశ్నించాడు. వారప్పుడు నమ్రతతో వినయ విధేయతలు ప్రదర్శిస్తూ లేచి మునుపోని తలలు వాల్చి ఈపట్టణ పరిపాలకుడు వేరే రాజధానికి పని మీద వెళ్ళాడనీ కొద్దిరోజుల్లో తిరిగి రాగలడనీ తెలియజేశారు.

అప్పుడు రాజు తనకు తానే పరిచయం చేసుకుంటూ "నేను మారిపూర్ ప్రభువును. నా ఆజ్ఞ ప్రకారం మీ పరిపాలకుడు ఒక వారంరోజుల్లో నా ముఖ్యపట్టణానికి వచ్చి నా మంత్రులు, సామంతులు తదితరమేధావులు పాల్గొని జరుగబోవు పెద్ద సభలో పాల్గొని ఈ పట్టణము నా రాజ్యములోని భాగమో కాదో తుది నిర్ణయానికి రావాలని వారికి తెలియజేశాడు. ఆ ఊరిప్రజలు అతణ్ణి రాజుగా తెలుసుకొని అతనిని సత్కరించి పంపిరి. విద్య, తదితరవిషయాల్లో మునిపూర్ పరిపాలకుడు అసమర్థుడని యిదివరకే తెలుసుకున్నాము. ఆకాలంలో ప్రజలదే రాజ్యం! వారి యిష్టప్రకారమే రాజ్యకార్యకలాపాదులు జరుగుతూ ఉండేవి. న్యాయమే, ఆ కాలంలో విజయం పొందేది. మునిపూర్ పరిపాలకుడు ఈ వారంరోజుల్లో తిరిగి రాడనీ, ఒకవేళ తిరిగివచ్చినా వ్యర్థుడనీ తెలుసుకున్న ప్రజలు వాళ్ళందరిలో కలిసిమెలసి తిరిగి వారి మంచిని ఆలోచిస్తూ వారి హక్కుల కొరకు పోరాడి ప్రముఖపాత్ర వహించుచున్న గొల్లయువకుణ్ణి



ప్రసిద్ధికెక్కిన నాటింగ్ హామ్ నగరంలో సరిగఅల్లికపరిశ్రమచేయు వనితలు.

హరిపూర్‌లో జరుగబోవు సభకు పంపవలెననీ, అతనికి తెలివితేటలు ప్రదర్శించి నెగ్గి రాగల చాకచక్యం ఉందని గ్రహించి మునిపూర్ ప్రజల పక్షాన తమ హక్కుల గురించి వాదించుటకు నాయకునిగా ఎన్నుకొనిరి.

ఆ గొల్లయువకుడు రాజ్యతంత్రాలతో అనుభవము సంపాయించకపోయినప్పటికీ, పరమేశ్వరుడు పుట్టుకతో యిచ్చిన తెలివితేటలు తప్ప విద్యాసంపద ఎక్కువగా లేకపోయినప్పటికీ మనోధైరము, గుండెనిబ్బరము కలవాడు గనుక నదురూబెదురూ లేక సభలో పాల్గొనుటకు అంగీకరించెను. ఇంకా యిద్దరు అభ్యర్థులు వెంటరాగా గొల్లయువకుడు నాయకత్వము వహించి నిర్ణయించిన రోజుకు హరిపూర్ చేరుకొనెను.

ఆ గొల్లనాయకుణ్ణి హరిపూర్ రాజుకు పరిచయంచేసిరి. ఆ సభాభవనము అలంకరింపబడి బంగారు వెండికుర్చీలతో దేదీప్యమానముగా ప్రకాశించుచుండెను. గొల్లనాయకుడు అతనికి నిర్దేశింపబడిన ఆసనమందు ఆసీనుడయ్యెను. ఆసభాభవనాన్ని అందు పాల్గొనే మేధావులను చూచినపుడు దిగ్భ్రమ చెందినా భయపడక ధైర్యమును చిక్కబట్టి రానున్న అవకాశమునకై వేచివుండెను.

హరిపూర్ ప్రభువు తన కుడి చెయ్యివేళ్ళను ముడిచి, మొదటి వ్రేలిని విప్పి గొల్లనాయకుని వైపు చూపెను. గొల్లనాయకుడు ఆలసించక చేతి రెండు వ్రేళ్ళను విప్పి చూపెను. గొల్లనాయకుడితో

గేయాలు :

# ప్రబోధము

## శ్రీ జోస్యుల సూర్యనారాయణమూర్తి

స్వతంత్రభారత
పవిత్రభాస్కర
మహోదయ మ్మిది
లేవండోయ్!
ప్రజాప్రభుత్వ
ప్రభాతరోచిః
ప్రసార మయ్యెన్
ప్రజలారా!
స్వకీయధర్మ
ప్రకారసాధన
సుకౌశలమ్మును
నెఱపండీ!
స్వతంత్రభారత
శుభప్రశస్తికి
నిరంతరోద్యమ
మనంతరీతుల
సమంతతఃకృషి
జరుపండీ!

భవిష్యదుత్తమ
పవిత్రపౌరుల
నిమిత్తమయి మీ
సమస్తభారత
స్వతంత్రయోధుల
యశఃప్రశస్తిని
సవిస్తరముగా
ప్రశంసించుడీ!
విజాతిపాలక
వికారచిహ్నము
లదృశ్యమై నే
డశోకధర్మ
ప్రసిద్ధచక్రం
ప్రశస్తి నందెను
తెలియండోయ్!
తెలియండోయ్.

॥స్వతంత్ర...॥

మారుమాట్లాడక మూడువ్రేళ్ళను విప్పి చూపెను. రాజుమనస్సులో ఏదో అభిప్రాయం ఉన్నట్లు సభాసదులు గ్రహించిరి. గొల్లనాయకుడు నాలుగు వ్రేళ్ళను విప్పి చూపెను. రాజు అప్పుడు కుడిచేతి బొటనవ్రేలిని విప్పి తక్కినవ్రేళ్ళను ముడిచి ఎడమచేతిచుట్టు కుడిచేతి బొటవ్రేలిని త్రిప్పెను. అప్పుడు గొల్లనాయకుడు కుడిచేతి అన్ని వ్రేళ్ళను మూసి రాజుకు చూపెను. మంత్రులు, సభాసదులు దాని భావాన్ని గ్రహించలేక అభినందన సహస్రములు గొల్లనాయనిపై కురిపించిరి. హరిపూర్ ప్రభువు ఆనంద పరవశుడై అతని తెలివితేటలను కొనియాడెను. ఇతడే నిజముగా మునిపూర్ నాయకుడని తెలియచేసెను. గొల్లనాయకుడు సభ ముగిసిన తరువాత మునిపూర్‌కు చేరుకొనెను, మునిపూర్ ప్రజలకు జరిగిన సంగతంతా చెప్పి హరిపూర్‌కూ మునిపూర్‌కూ ఎటువంటి సంబంధ బాంధవ్యాలు లేవనీ మునిపూర్ స్వతంత్ర రాజధానీనగరం అని చెప్పాడు. మునిపూర్ హరిపూర్‌తో ఏకమైపోతుందనే భయంతో ఉన్న ప్రజానీకానికి ఈ మాటలు వినగానే పట్టరాని సంతోషముతో ఉఱ్ఱూతలూగిరి. అతని వివేకాన్ని, ధైర్యాని పొగడిరి.

పండితులు, మంత్రులు, ప్రముఖ

రాజఉద్యోగులు హారిపూర్ ప్రభువుచుట్టూ గుమిగూడి "ప్రభూ, గొల్లనాయకునితో మాటమాత్రమైనా లేకుండా కేవలం చేతివ్రేళ్ళ సంజ్ఞతో ఏవిధంగా అంతక్లిష్టసమస్యను ఇట్లే పరిష్కారం చేయగల్గా" రని అడిగారు.

రాజు అప్పుడు ఈవిధంగా వారి సందేహాన్ని తీర్చాడు. "మీరు ఈ ప్రశ్న అడిగినందుకు నాకు ఎంతో సంతోషముగా ఉన్నది. మునిపూర్ ప్రజలపక్షాన నాయకత్వము వహించి మనసభలో పాల్గొని గొల్లనాయకుని వైపు నా చేతి వ్రేలిని విప్పి చూపి అతణ్ణి నీకు ఒక వేదము తెలుసునా అని ప్రశ్నించాను. దాని సమాధానంగా అతడు అతని చేతి రెండువ్రేళ్ళను తెరచి రెండు వేదాలు తెలుసు నన్నాడు. తిరిగి మూడువ్రేళ్ళను విప్పి చూపాను. తిరిగి అతడు నాలుగువ్రేళ్ళను విప్పి తనకు ఋగ్వేదము, సామవేదము, యజుర్వేదము, అథర్వణవేదము తెలుసు నన్నాడు. దానికి నేను తృప్తిచెందక యింకా అతణ్ణి పరీక్షించాలని నా కుడిచేతిబొటనవ్రేలిని విప్పి తక్కిన వ్రేళ్ళను మూసి ఎడమ చేతిచుట్టు కుడిచేయిబొటనవ్రేలిని త్రిప్పాను, నా ప్రశ్న సృష్టి ఏవిధంగా పరిభ్రమిస్తోం దని. గొల్లవాడు కుడిచేయివ్రేళ్ళను ముడిచి చూపాడు. దానికి అర్థం సృష్టికర్త చుట్టూ సృష్టి తిరుగుతుం దని తెలిసింది. అంతకన్నా పరీక్ష వేరే అవసరం లే దని నాకు తోచింది. అప్పుడు నేను మునిపూర్ స్వతంత్ర రాజధానినగర మని నిశ్చయానికి వచ్చాను."

గొల్లనాయకుడు తనయూరి ప్రజలకు రాజు తన్నడిగిన ప్రశ్నలకు సమాధానం ఈ విధంగా యిచ్చి నచ్చచెప్పా నని అన్నాడు. "నేను సభలో కూర్చొనిఉండగా హారిపూర్ ప్రభువు తన కుడిచేతివేళ్ళల్లో ఒకవ్రేలిని విప్పి నావైపు చూపిస్తూ నన్నొక గొర్రెపిల్ల యిస్తావా అని అడిగాడు. దానికి నేను ఒక టేమిటి రెండు యిస్తా నని నా కుడిచేతి వ్రేళ్ళను విప్పి చూపాను. రాజు చేతి మూడువ్రేళ్ళను విప్పి చూపాడు. అందుకు నేను నాలుగు వ్రేళ్ళను విప్పి చూపించి నాలుగు గొర్రెపిల్లలను బహూకరిస్తా నని అన్నాను.

రాజు కుడిచేతిని ముడిచి బొటనవ్రేలిని విప్పి గిఱగిఱా త్రిప్పుతూ గొర్రెలన్నీ కావా లని కోరాడు. అందుకు నేను అంగీకరించినట్లు చేతివ్రేళ్ళను ముడిచి పిడికిట చూపాను. అప్పుడు రాజు స్వతంత్రఅభిప్రాయము గల ఒకానొకవ్యక్తి ఉన్నాడని గ్రహించి మునిపూర్‌ను స్వతంత్రరాజధానిగా నిర్ణయించా నని అతని మనస్సులో ఉన్న అభిప్రాయాన్ని వెల్లడిచేశాడు.

మునిపూర్ ప్రజలు అతని సాహసానికి మెచ్చుకొని అతణ్ణి పరిపాలకునిగా ఎన్నుకొనిరి.

(అంగ్లానువాదం)



ప్రసిద్ధికెక్కిన నాటింగ్‌హామ్ నగరంలో సరికల్లికపరిశ్రమచేయు [illegible].

# రుద్రమదేవి

(12-వ పేజీతరువాయి)

గడియలలోపల రాజపురుషులకు నిరాటంకముగా నప్పగింపవలసినదని ఆజ్ఞాపత్రి మంపెను.

ఆ వసతియధికారు లది లక్ష్యము చేయలేదు. సిద్ధుని యాగమనమాదిగా తమ వసతికి జనసామాన్యములో పెరుగుచున్న భక్తిప్రపత్తులు వారి కన్నులకు కొంచెము మైకము కలిగించినవి. అందులో వారి కాపత్రము కార్తిక శుద్ధ ఏకాదశినా డందెను. ఆ క్రిందటిదినముననే సిద్ధుడు జనులకు గుట్టపై దర్శన మిచ్చియుండెను. ఈనాడు భక్తులు తండోపతండములుగా అక్కడ మూగుచుండిరి. వారిలో కొందరు వసతిచుట్టును ప్రదక్షిణములు చేయుచుండిరి. మరికొందరు వివాదగ్రస్త మగు ప్రదేశమున గల నేమినాథవిగ్రహమునకు కానుక లర్పించుచుండిరి. ఆ యుత్సవము ఉదయమునుండి సాయంకాలము వరకే కాక రాత్రియందంతట సాగిపోయెను. వారిలో పలువురు ఏకాదశిఉపవాసము చేసినవారే. ఆ రాత్రి వారికి జాగరణమును సిద్ధించెను. ఆ రాత్రి జనములో ఆవేశము పెరిగిపోయెను. భజనలు ప్రబలినవి. అక్కడ జనములు ఇసుక వేసిన రాలన ట్లుండిరి.

ఆ జనసమూహములను జూచుచున్న కొలదియు వసతియధికారులకు నిర్లక్ష్య మెక్కువయ్యెను. ఈ సందర్భములో వసతియధికారులు స్వయముగా నా నేమినాథవిగ్రహము తీసివేయుదురా? తీసివేయదలచినను తీసివేయగలరా? ఇదంతయు అంబదేవుడు సూక్ష్మముగా గ్రహించెను. తీవ్రముగా నాలోచించెను; దృఢముగా నిశ్చయించెను. కాలవ్యవధి గడచినపిమ్మట ఒక్క క్షణమైనను ఆలసింపక ఆ విగ్రహమును తీసివేయింపవలెను! దేవతావిగ్రహమును తీసివేయుటకు సామాన్యముగా పనివారు వెనుకాడుదురు. వసతియధికారులు స్వయముగా తీసివేయరు. రాజపురుషులు తీసివేయించనిచో రాజగౌరవము చులకన యగును. ఇందులో తాను అక్రమ మేమియు జేయుటలేదు. వసతిలోని వారి దుస్తంత్రమును పరిహరించుటే!

పనివారిలో ముఖ్యముగా రెండువిధములవారు కలరు. శిలలు చెక్కుటలో ఎక్కువ నేర్పుగలవారు చాలవరకు జినాభిమానులును జైనభక్తులును. కాని వారిలోకూడ కొందరు బసవమతము స్వీకరించిన లింగబలిజలుకూడ కలరు. ఖనకులు విస్తారముగా బసవమతము స్వీకరించిన వీరశైవులే. ఆ వసతితో వివాదకలిగిన ప్రదేశమున మరునాడు పనిచేయుటకు ప్రత్యేకముగ బసవమతస్థు లున్న తండములనే నియోగింప నారాత్రి అంబదేవుడు రహస్యముగా నాజ్ఞలిచ్చెను.

ఆ మరునాడు సరిగా మధ్యాహ్నమగుసరికి స్వయముగా నంబదేవుడే భటులతో నా ప్రదేశమునకు వచ్చెను. సరిగా నప్పటికి వసతియధికారులకు ఆజ్ఞాపత్రము చేరి అరువదిగడియ లైనది. నేమినాథవిగ్రహ మట్లే యుండెను. అడ్డు లన్నియు దొలగించి యక్కడ సూత్రధారులు గుర్తించినప్రకారము కందకము త్రవ్వించివేయుటకు అంబదేవుడు స్థపతుల కాజ్ఞాపించెను.

ఒక ప్రక్కను నేమినాథపూజలు జరుగుచునే యుండెను. సమీపమున బనిచేయుచున్న లింగబలిజల మధ్యనుండి 'హరహర మహాదేవ! అను సింహనాదము భూనభోంతరముల నిండిపోయెను. కొందరు నృత్యపరు లైరి. కొందరు పండితారాధ్యచరిత్రమునుండి వరుస లందుకొనిరి.

'నల్లవో! నల్లవో! నగరాజరాజ!
మల్లయా! మల్లయా! మహనీయతేజ!
పరమపాతకకోట్లు భస్మమై తూలు
సిరిగిరిమల్లన్న శరణన్న జాలు!

* * * *

శంకరదాసయ్య వంకమంచయ్య
బంకయ్య శివరాత్రిసంకయ్య శరణు!
ఏలేశుకేతయ్య ఇండె కాంతయ్య
మోళిగమారయ్య మున్నయ్య శరణు!"

* * * *

కన్నడభక్తుల వరుస యిట్లు సాగినది.

"అజగమదేవయ్య! బిజ మాడిరయ్య
నిజభావదేవయ్య! నీ విత్త బన్ని!

* * * *

హబ్బుత్త కొబ్బుత్త, యుబ్బియాడుత్త,
పబ్బతి దొడవరంగె భక్తి మాడిరి భా
హాడుత్త, యాడుత్త, నోడుత్త, బత్తి
మాడిభో! సిరిగిరిమల్లి కార్జునగె.

* * * *

హరహర! శివశివ! శరణు నీ వెనగ
సిరిగిరి[illegible]ల్లయ్య శర ణెన్నిరయ్య!"

ఆ భా[illegible]టాను మహా[illegible]ష్ట్రభక్తు లీవరుసను నడచిరి.

"ప్రబ్బసంతాపసంసారనాటకనె
ప్రబ్బతమల్లయ్య ప్రబ్బజ్ఞ గాతాం!
అమ్మా మగాఫుణూ హరజాణచిత్త
అమ్మా మహాభక్త అఖిలసమ్మోళ!"

అరువదేశముభక్తు లీ వరుసను నడచిరి.

"అలా త్తుగూవరు క్కాత్మనాయకనె

మఱునాలు మరియూదమల్లి[illegible]ర్జు[illegible]
ఆలాలగంపెనే యూదియప్రవనె
చూలియే మల్లికార్జుననె యన్నవనె!
యెల్ల యిల్లాదానె యెజ్జుముళ్లవనె
చొల్లవల్లాదానె మల్లికార్జుననె!

వారిలో సంస్కృతము కొంచె మభ్యసించిన [illegible]రు ఈ వరుస యందుకొని పాడసాగి.

"మల్లికామాలికామస్తకాభరణ
మల్లికార్జున దేవ మామేవ పాహి!
మల్లికాఘనసార మందారదేహ
మల్లికార్జునదేవ మామేవ పాహి!
మల్లికార్జునయశోమండితశాంత
మల్లికార్జున దేవ మామేవ పాహి!"

ఈవిధముగా ఆంధ్రమునను కర్ణాటకమునను ఆరెభాషను అరవమునను సంస్కృతమందును పండితారాధ్యచరిత్రములోని పదములు కీర్తించుచు భక్తియు వీరమును ఆవేశించిన యా జంగమలింగమూర్తులు పలుగులు పారలు దూలములు మోకులు తీసికొని ఉద్భటాటోపముతో కుప్పించుచు అచ్చటికి వచ్చుచుండిరి.

అది చూచి నేమినాథు నర్చించుచున్న జినభక్తులుగూడ నానావిధవీరాలాపము లాడుచు వారి నెదుర్కొన నుంకించుచుండిరి. అంతకు మున్న అక్కడ తన నూరుగురువీరభద్రులతో సిద్ధముగా నున్న గండడు అంబదేవుని యాజ్ఞచే ఆ జినభక్తుల మందలించి యంబదేవుల యాజ్ఞ యందరు వినునట్లు ప్రకటించెను. దానితో జినభక్తు లేమియు జేయ సాహసింపక పలువిధముల విలపించుచు తిట్టుచు తొలగిరి. లింగబలిజలు నిరాటంకముగా నా ప్రదేశమున ప్రవేశించి కందకభాగము త్రవ్వివేయుచుండిరి. కొందరా నేమినాథవిగ్రహమును ఎత్తివేయుటకు దూలములకు మోకులు పూనించి యా విగ్రహమునకు కట్టి దూలములకు బుజము లానించి శివభక్తులు 'హరహరమహాదేవ శంభో!' అని ఊపుగా ఎత్తుచుండిరి.

అప్పు డాదారిన బోవు శ్రీశక్తి యొక డిట్లు పాడెను.

"కృతకృత్య వరివళిగెను నైజకవ్వ
పతి ధిక్కరించి సద్భక్తిపెక్కువను
జనుదెంచి చనుదెంచి చక్కన వసది
గని భవాలయ మని కరములు మొగువ
నట జినప్రతిమయూ పప్పడ వ్రస్సి
పటపట వ్రక్కలై పసగ మధ్యమున
నైజనాథుం డుమావరు డుదయింప
నైజకవ్వయు వికస్వరభక్తిమహిమ
వసుధ జైనం డను వార్తయు నడప
నెసగునా డీజైను లెక్కడె సనిరి 9"

అత డా ద్విపదలు పలుకుచుండగనే శివభక్తులు నేమినాథప్రతిమను ఎత్తివేసిరి. ఆ యావేశములో దాని రూపు లేకుండ ఛిన్నభిన్నము లగునట్లు దూరమున దాని బారవేసెడివారే! కాని రాజపురుషులు అనుక్షణమును వారివెంట నుండి జాగ్రత్తగా వసతిస్థలములో నంచవలసిన దని ఖండితముగా నాజ్ఞాపించుటచే వారు రాజాజ్ఞలకు కట్టువడి యట్లు చేసిరి. నేమినాథప్రతిమకు ప్రమాదము రాకుండ తప్పిపోయెను.

అంతలో నచ్చట నొక మహాద్భుతము జరిగెను. నేమినాథుని విగ్రహము తీసివేసినచోటనే ఒక మహాశివలింగము నూర్ధ్వభాగము ప్రత్యక్ష మయ్యెను!

---

# అమరావతి

(9 వ-పేజీ తరువాయి)

వ్యాసమును 3, 5 అంగుళముల యెత్తును, లోపల ఒక యెముకముక్కను గల్గియున్నది. ఇందులో దొరకిన వస్తువులబట్టి స్ఫటికము పైన అక్షరములు చెక్కగల శిల్పులున్నటుల తెలియ నగును. "ఆధ్యాత్మికజ్ఞానం ప్రస్తరరూపముల దాల్చినది అమరావతిలో" శిల్పములో జనుల జీవితవిధానములు, సాంఘికపరిస్థితులు చిత్రితమైనవి. స్త్రీసౌందర్యము, స్వాతంత్ర్యము, నాట్య, సంగీత, ధర్మసభలలో స్త్రీ పురుషునితో సమానస్థాన మాక్రమించుట శిల్పములో గాననను. స్త్రీలు భిక్షుకలై నిర్వాణప్రాప్తికై పాటుపడు నధికారమును బుద్ధునిచే బొందుట. స్త్రీలవస్త్రాలంకారములు - కంఠహారములు, కాళ్లకు కడియాలు, పురుషుల వస్త్రాలంకారాలు, రాజులమణిమయ కిరీటములు, ఛత్రచామరములు చిత్రితములు. కుర్చీలు, బల్లలు, మంచములు, సింహాసనాలు, పళ్లెములు, గిన్నెలు, కావడులు, కుక్కలు, నెమలిపిట్టల యిండ్లలో పెంచుట, ఏనుగులు, గుఱ్ఱములు, రథములు, పడవలు, ఎడ్లబండ్లు, వాహనములుగ వాడుట ప్రస్తరములలో చెక్కబడినవి. శిల్పిభావసంపద కళాకౌశలము అత్యద్భుతముగ, మనోహరముగ కరుడు గట్టినవి అమరావతిలో.

ధాన్యకటకములో అనేక బౌద్ధవిహారములు-సంఘారామము లుండెడివి. గొప్పప్రాచీన విశ్వవిద్యాలయ ముండెను. చీనాయాత్రీకులు వీని గుర్తించిరి. కోటరాజుల కాలములో అమరావతీ మహాచైత్యము చెక్కుచెదరకుండ నున్నది. ధాన్యవాటిలో వెలసిన ప్రజాగురువు బుద్ధదేవునికి, రెండవ కోటకేతరాజు రాణులతోగూడ దాన మిచ్చెను. గతశతాబ్దములో ఒక జమీందారు యిటుకలు, మణిశిలలకై స్తూపము బయటపెట్టెను. శిథిలములు, బ్రిటిషు, మద్రాసు మ్యూజియములలో భద్రపరుప బడినవి.

మహాచైత్య సామీప్యమందే శోభాయమాన శిల్పసమన్వితఅమరేశ్వరాలయ మున్నది. ఇది బహుశః వేయేండ్లకు పూర్వము నిర్మితమై యుండును. ఆలయమును నలుప్రక్కల పైన పూర్తిగ మూయబడిన కట్టడము జైనబస్తి-మీద శైవులు కట్టిరి. కాన ఆలయం అనుగుఅంతస్థు మూయబడి వున్నది. ఆలయాకారం స్తూపాన్ని బోలుట, ఆలయ సమీపములో లభించిన జైనవిగ్రహముల బట్టి, అమరేశ్వరలింగము మొదట బౌద్ధ లేక జైనవిగ్రహమని, బ్రాహ్మణులు దానిని లింగముగ మార్చిరను యూహ సవ్య మని తోచును. అమరావతి జైనకేంద్రమైనట్లు శిథిలములు సూచించుచున్నవి. ఇచట జైనులకు బ్రాహ్మణులకు వివాదము జరిగిన దనియు, జైనులు ఓడిపోయిరని ప్రతీతి. అమరేశ్వరలింగము చాలయెత్తుగ నున్నందున అభిషేకము చేయుటకు కొన్ని సోపానము లెక్కి వెళ్లాలి. అమరేశ్వరుడే అమరలింగమును ధాన్యవాటిలో ప్రతిష్ఠించి పూజించినందున అది అమరారామ మైనదని శాసనస్థ పురాణగాథ. ఆంధ్రదేశములో పంచారామములు, పంచతీర్థములు, పంచారామతీర్థములలో నొకటి అమరావతి.

# ఆంధ్రాష్టపదులు

(10 వ-పేజీ తరువాయి)

రచించినట్లు తెలియుచున్నది. ఇతడు కవిరాజకంఠీరవబిరుదాంకితు డైనట్లు చెప్పకొనినాడు. చూడుడు—

గుణనిధి వేంకటనారా
యణ 'కవిరాజన్యసింహు' డారోక్తులచే
జణు లగు సత్కవిజనములు
ప్రణుతింపగ నాదినష్టపదిరచియించెన్.

అష్టపది నాంధ్రీకరించిన తొలికవి యితడు. తన కావ్యమును—

ఏతాదృశగుణరత్నస
మేతునకు సమస్తభువనహేతునకు నత
వ్రాతగృహపారిజాతున
కాతతరణవిజయచణితహరిజాతునకున్
వ్రజయువతీలోలునకు బం
కజదళవర్తిక్షణాంసకల్లోలునకున్
సుజనకృపాలునకున్ జిత
కుజశిప(పాలునకు) మదనగోపాలునకున్
అంకితము చేసినాడు. మఱియు
శ్రీరాధావనితాదివల్లవసుదృగా
ళీరాజివిద్యుల్లతా
వారంబై తగ...యసదీ
వ్యన్నీలధారాధర
స్ఫారాకారత నుండు నా మదనగో
పాలుండు వెల్లంటి కా
వేరిక్ష్మావరనందనుం గసవప్ర
ధ్వీనాథునిం బ్రోవుతన్

అని వెల్లంటి కసవభూపాలుడు తన పోషకప్రభు వగుటను పేర్కొనినాడు.

సంగీతసాహిత్యములకు సహా నాదర మొసగి కవితాగానకళలను ప్రోత్సహించి కళాసేవ గావించిన కార్వేటినగరసంస్థానమే యీ తెలుగుసేతకును ప్రభవ మగుట యెంతయు సమంజసము. జాతీయపద సాహిత్యమునకు గాణాచి యయిన సారంగపాణిపదములును, సంగీతసాహిత్యముల సరస సమ్మేళనముచే రసానందము కూర్చు నీ గీతగోవిందానువాదమును కార్వేటినగర సంస్థానమునకు గర్వకారణములు కాగలవు. సంగీతమునకు సాహిత్యమునకు నా సంస్థానము గావించిన సేవ యపారము.

గీతగోవిందమున కిది పద్యానువాదము. ఆదినుండి యేకాదశాశ్వాసమువఱకే యుండి యసమగ్రముగా నున్నను నన్నంతవఱకీయనువాదము నిర్దుష్టముగా, సరసముగా, సరళముగా నున్నది. అష్టపదులలోని భావసంపద చెడకుండ, సులభముగా, సరసముగా, జక్కనిశయ్యతో నిందలిపద్యములు హృదయంగమములుగా నున్నవి.

మచ్చునకు గొన్ని పద్యములు—

శృంగారాధిక యైన రాధిక బహు
స్త్రీయుక్తుడై చుంబనా
లింగాదిస్మరకేళుల న్విభుడు కా
ళిందీతటాంతాటవిన్
రంగు ల్మీఱ జెలంగినట్టి చరితన్
వర్ణింప వర్ణించెద
ద్భంగిన్ శ్రీజయదేవధీరు డిది సౌ
భాగ్యంబు మీ కీవుతన్.

అరమోడ్పుం గనుదోయితో శ్రమజల
వ్యాసక్తగాత్రంబుతో
జిఱునవ్వు ల్మను జెక్కుటద్దములు రా
జిల్లన్ గగుర్పాటుతో
సరసీజాస్త్రి రణాంతవిభ్రమ వికా
సంబుల్ ప్రకాశింపగా
మురువై దోచు మురారిఁ జూచు కుశలం
బుల్ గూర్చు మా నెచ్చెలీ!

సురతకళారసాలసత
సోలుచు సమ్మదవార్ధిఁ దేలుచున్
వరతనువల్లి శయ్యపయి
వ్రాలుచు నుండగఁ బ్రేమనిండగాఁ
గరము రహించ నన్నెనసెఁ
గంసహరుం డరమోడ్పుఁ జూపుతా
మరలు చెలంగ నవ్విభుని
మన్నన యెన్నడు గల్గు నెచ్చెలీ!

ఇచ్చట నుండ నేటికి చె
లీ! విఫలం బగు నిచ్చ నా పయిన్
మచ్చర మెచ్చె నచ్యుతుఁడు
మానిని నొక్కతెఁ గూడి వేడుకన్
ముచ్చట లాడుచు న్నగుచు
ముద్దిడుచు న్మతి కౌగిలింపుచున్
రచ్చలు సేయసాగె నిటు
రాడు గదే యెటు లోర్తు నెచ్చెలీ!

చక్కెరమోవి యానె నొక
చక్కని మానిని తద్రతంబునన్
సొక్కుచు సోలుచున్ భువన
మోహనవిగ్రహుఁ డైన శౌరి పే
రక్కునఁ జేర్చి కుందనపు
టందెల నాదు చెలంగ బత్తిమిన్
మిక్కుట మైన వేడుక ర
మించె గళత్పరిధానకాంచి యై.

మరుఁ డను సార్వభౌముడు స
మస్తజగద్విజయాభిరాముఁడై
హరిణవిలోలలోచన మ
హోజఘనంబును రత్నకాంచన
స్థిరతరసింహపీఠపయిఁ
జెల్వెసగన్ వసియించెఁ దోరణ
స్ఫురణముఁ గూర్చె నచ్చట
విభుండు మణీరశనచ్ఛలంబునన్

'రసికజనమనోరంజననిదానము, రమణీయరాధికారమణశృంగారాపదానము, విద్వజ్జనానందసంధానైకతానము, మృదుమధురపదవితానము, సకలసద్గుణనిధానము'నగు గీతగోవిందాభిధానకృతిప్రధాన మిది "ప్రశస్తగోస్తనీపాకసంవిధానంబు"గ రచియింపఁ బడినది. విద్వత్కవిరచితకృతి యగుటమాత్రమే గాక కార్వేటినగరసంస్థానకృతి యగుటచేతను గూడ నిది లభించినంతవఱకు ముద్రింపఁదగిన గ్రంథము.

ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమువారు సంగీతగ్రంథముల డిస్క్రిప్టివు కేటలాగును ప్రకటించుచు నుపోద్ఘాతములో నీగ్రంథమును గూర్చి యిట్లు వ్రాసిరి.

'The author of this Prabandha is Rigvedi Venkatanarayana who is the son of *Kavikanthirava Venkatachala Kavi, the author of Champu Ramayanamu. Both Father and son have dedicated their works to Vellanti Kasava, Rajah of Karvetinagara. Besides this Venkatanarayana wrote Lakshanaparinayamu and Krishnavilasamu in Sanskrit, Madanagopalavijayamu in Telugu. Though incompleate the translation deserves attention as the work belongs to Karvetinagara Samsthanamu which had been the seat of well known pœts and musicians.'—

౨

ఓగిరాల వెంకటరత్నదాసకవి కృష్ణామండలములోని కదళీపురవాస్తవ్యుఁడు. కదళీపురమే నేఁటి కళ్లేపల్లి. ఈ కవీశ్వరుఁడు కదళీపురమదనగోపాలదేవాంకితము గాఁ దెలుఁగు

* ఇందు "కవిరాజకంఠీరవ" బిరుదము కవీశ్వరుని తండ్రి యగు వెంకటాచలకవి కుండినట్లు వ్రాయబడియున్నది. గ్రంథస్థాధారములఁ బట్టియు, నాశ్వాసాంతగద్యలనుబట్టియు నా బిరుదము కుమారునిదే యయినట్లు తెలియుచున్నది.

పద్యకీర్తనములను సాంధ్రాష్టపదులను రచించినాడు. కృత్యాదిపద్య మిది చూడుడు.

శ్రీ కష్ణోత్తరనిమ్నగా వరుణ ది
క్సీమాగ్ర గప్రోజ్వల
త్ప్రాకారాంతర రత్నపీఠతల వి
శ్వామిత్ర సంస్థాపిత
స్వాకారోభయ పార్శ్వభోజ నృపక
న్యా సత్యభామా త్తశో
భాక శ్రీ కదళీపురీ మదన గో
పాలా ! కృపాంభోనిధీ!

జయదేవకవి రాధాకృష్ణుల రతికేలికా కలాపకలాపములను సౌరభాషచేఁ బ్రబంధించి పండితజన పేటికలను భద్రపఱుపఁగా నితఁడు వానిని దెలుఁగుకీలున బయలుగాఁ దివిచి యఖిలభక్తులకుఁ గొల్ల పెట్టినాఁడు. తన్నుఁ గూర్చి యితఁడు చెప్పికొన్న యీ పద్యముఁ జూడుడు——

శ్రీ కృష్ణపాదరాజీవ షట్పదుడు వా
గ్దేవతా చరిత-చిత్రితనిజాత్మ
సద్మ పద్మావతీచరణచారణచక్ర
వర్తి యౌ జయదేవపండితకవి
ప్రథితరాధాకృష్ణరతికేళి కౌకలా
పకలాపములు సౌరభాషచేఁ బ్ర
బంధంబుఁ గావించి పండితజన పేటి
కలను భద్రముఁ జేసె నలరి వానిఁ
దెలుఁగుకీలున బయలుగాఁ దివిచి యఖిల
భక్తులకుఁ గొల్లవెట్టను వచ్చి కొనుఁడు
కోరికల నోగిరాల సత్కులుఁ డుదారుఁ
డరయ వేంకటరత్న దాసాహ్వయుఁడన.

గీతగోవిందములోని శ్లోకముల పద్యములుగాను, అష్టపదులను అష్టపదికీర్తనలుగాను నితఁడు తెనిగించినాడు. రాగతాళముల విషయమున మూలము ననుసరింపక స్వతంత్రించినాడు.

ఇతని పద్యానువాదము సరళమై, సరసమై మనోహరముగా నున్నది. అష్టపదికీర్తనానువాదము లయబద్ధమయినను భావగాంభీర్యము కోలుపోక హృదయంగమముగా నున్నది. సంస్కృతశ్లోకమున కితఁడు గావించిన పద్యానువాద మిది——

సా మాం ద్రక్ష్యతి వక్ష్యతిస్మర కథాః
ప్రత్యంగ మాలింగనైః
ప్రీతిం యాస్యతి రంస్యతే సఖి సమా
గత్యేతి చింతాకులః
స త్వాం పశ్యతి వేపతే పులకయ
త్యానందతి స్వేదతి
ప్రత్యుద్గచ్ఛతి మూర్ఛతి స్థిరతమః
ఫుంజే నికుంజస్థితః

అల చెలి వచ్చి కొంచు సక
లావయవంబులు కౌఁగిలించి తా
జెలఁగు ననంగధర్మములు
సెప్ప రమించు నటంచు శౌరిలో
నలరు విరాళి నొందు గను
నధ్వము గాంచును బుక్కలుం జెమ
ర్పు లోలయు మూర్ఛిలున్ స్థిరత
మా వృతకుంజము సేరి రాధికా!

"ధీరసమీరే యమునాతీరే" యిత్యాది జయదేవకవి యష్టపదికి ఈ కవీశ్వరుడు గావించిన కీర్తనానువాద మిది——

కేదారగౌళరాగము——ఆదితాళము.

మలయసమీరము గల యమునావని
గలఁ డమ్మ వనమాలి
చెలఁగుచు వ్రేతల వలుదచనులు వే
నలుము నెసల దయమాలి మలయ॥

౧. సురతనియతమం దిరమున శతసుమ
శర వేషమనోహరు డగుచు
తరుణీహృదయేశ్వరు డున్నాఁడే
పరసేయక శ్రీహరికడ కరుగవలె మలయ॥

౨. ఘనసంకేతస దనాంకితయుతమ్ము
గను మృదువంశము నూదుచు
వనిత నీదుపేన నంటు తెమ్మెర
లనెగయు రేణువులను మన్నింపుచు మలయ॥

3. పులుఁగులు గలచిన గలగలమును నా
కులరొంద నీరాక లనుచు లో
నలికి బెళుకు జూపుల నలరుల పా
న్పలరిచి నీ దారులు గాంచుచు నీ మలయ॥

౪. పడతి! వైరిక్రియ నడమ నందియుల
విడువు రతుల నాడిసేయున్
గడు జీకటి వేనడువు మసితకం
బళము గప్పి కృష్ణుడు కలవిడిదికి మలయ॥

౫. వరమరాళభా సురాభ్ర మన సుం
దరముక్తాహారరుచిరజా
హరియురమున మెఱుపురీతి కనకాం
గిరో మెఱసెదవె యు పరిసురతంబున
మలయ॥

౬. నలినసేత్ర మేఖలను వలువనుం
దొలగ ద్రోచి చెలువలరగను
కలికి మదలలకు సెలవగు నీ పిఱు
దుల విరిశయ్యం దుల జేర్పు మిపుడె
మలయ॥

౭. పడతిరో! గోపాలు డభిమాని శే
తడవు గడిచెబడి బడినను నా
నుడువులు విని యిప్పుడె మురారి లో
నపరెడి కోరిక లెడయక నింపవె మలయ॥

౮. సరోజముఖి యోగిరాల వేంక
టరత్నదాసుమది రంజిలన్
వరాంజలిడి యీధరన్ గదళికా
పురిన్ వెలయు శ్రీహరిం దలంచవె
మలయ॥

ఋగ్వేది వెంకటనారాయణకవియు, ఓగిరాల వెంకటరత్నదాసకవియు గీతగోవిందమునకు జేసిన యాంధ్రీకరణములు రెండును దెలుగుభాష కలంకారములు. తెలుగుసంగీత రచనములయందు ఈ యనువాదములకును, సంగీతగ్రంథరచయితయం దీ యిరువురు కవీశ్వరులకును నొక విశిష్టస్థానము కలదు.



తూర్పుగోదావరిజిల్లా వెనుకబడిన జాతులసభలో పాల్గొన్న ఎన్. జి. రంగా, కోయనాయకుడు బొజ్జదొరగార్లు.

# "నవ్వీన నాపచేను...."

(14 పేజీ తరువాయి)

ఉద్రేకాన్ని యెంతగా కుదించుకుందో ఆవిడకే తెలుసు.

లక్ష్మమ్మగారు ఆ మాటలు యే భావంతో అన్నదో రామారావుగారికి అవగాహ నయిపోయింది. అతనికి జబాబు చెప్పక తప్పలేదు.

"పోనిద్దూ అక్కయ్యా. ఎవరా శ వాళ్లది. అది అట్లాగ యేదో అంటూ వుంటుంది. యింత చిన్న విషయంగురించి మాటామాటా అనుకోవడ మెందుకు పోనిద్దూ. నీకు నీ కొడుక్కి పెళ్లి చేసెయ్యాలని వుందని తెలిసింది. ఇప్పుడు వాడికి చేసుకోవడం యిష్టం అవునో కాదో తేలేదాకా అసలు ఈ గొడవే యెత్తుకోవద్దు మనం" తమ్ముడు అన్నమాటలు లక్ష్మమ్మగారికి నచ్చేయి కామోల్ను, వెంటనే సమాధానం చెప్పేసింది. "చూడు తమ్ముడూ, ఉషా వాడూ ఎదిగినవాళ్లే కాని పిల్లలు కాదుకదా. ఒకర్నొకరు వరించుకోవడానికి ఎవరి కేక్కష్టాలున్నాయో తెలియదు. యిట్లాంటప్పుడు నా అభిప్రాయంకోసం సీతమ్మమాట ఒదిలిందికదా మరి. నే నేదో సమాధానం చెప్పేస్తే ఏమవుతుంది చెప్పు?"

"అవును మరి, నవ్వు చెప్పింది రైటే. కుర్రనాగమ్మ వాడి కేమిటో చెప్పు, మా అమ్మ అభిప్రాయం యిట్లా వుంది కామోల్ను, అట్లా చేసేస్తే పెద్దది సంతోషిస్తుం దని నీ మాట చెల్లించడానికి చూస్తాడే కాని, తన సంగతి చూసుకోడు - చూశా వక్కయ్యా. యీ పెళ్లిగొడవలు ప్రారంభంలో యేమీ లేనట్టుగా వుండి, రాను, రాను తగువుల్లోకి దిగుతాయి. అందుచేత సుందరంఅభిప్రాయం ప్రారంభంలో తేలితేగాని, యీ విషయమే యెత్తుకోవద్దు మనం, ఎంచేతనంటావా, వాడి జాతకంలో స్కూలు ఫైనలుదాకా చదివినా, యుద్ధంలోకి పోయి పెద్దపైలట్ అవ్వాలని వుంది దాని జాతకంలో బి. ఎస్. సి. దాకా అయినా చదువుకోవాలని వుంది. సాధారణంగా వాళ్లకన్నా యెక్కువగా చదువుకొన్న ఆడవాళ్లని చేసుకోవడం కుర్రాళ్లకి యిష్టం వుండదు."

రామారావు ఈ మాటలు అన్నతర్వాత లక్ష్మమ్మగారే మనుకుందో గాని మరి మాట్లాడలేదు. సీతమ్మగారు మాత్రం చిన్నబుచ్చుకొంది, భర్త తన మాటల్ని తీసిపారేశాడని.

సుందరం వంటగదిలోంచి ఎంతో భారంగా తేలివచ్చాడు. పెళ్లిగొడవ అతని మీదికి రావడంవల్ల పాతసంగతులన్నీ జ్ఞాపకంరావడం మొదలెట్టాయి. నాలుగు సంవత్సరాల క్రిందట తను తల్లినీ తండ్రినీ దుఃఖపెట్టి మిలిటరీలో కెట్లా పారిపోయిందీ, మిలిటరీలోకి వెళ్ళకముందు ఎంతో సరదాగా తడుముకోకుండా మాట్లాడే ఉష, రెండుసంవత్సరాలక్రిందట తను సెలవుమీద ఇంటికి వచ్చినప్పుడు కాలేజీలో జేరిందన్న గర్వంవల్ల కాబోలు అసలు మాట్లాడక పోవడం, అన్నీ జ్ఞాపకం వచ్చాయి.

ఉషతత్వం చాల చిత్రమైంది. చదువుకోవడంవల్ల కొన్ని అసాధారణమైన లక్షణాలేవో తనని అంటుకొన్నాయని ఎవరైనా అంటే, చాలా కించపడుతూ ఉంటుంది. అట్లాంటివేవీ తనలో కనపడక శారదా, ఉషా యెప్పుడు మాట్లాడుకున్నా వైవిహ్యానికి సంబంధించినవాటిగురించే మాట్లాడుకొనేవారు.

"కాలేజీల్లో చదువుతే మన కేమిటో చెడ్డబుద్ధు లబ్బుతాయిట, యేమిటే అవి?" అని ఉష అంటే."ఏమో మరి పాడైపోతామట." అని శారద నవ్వుతూ అనేది. దానికి ఉష జవాబు చక్కగా చెప్పేది. "పాడైపోవడం అంత సులభమటే?" అని.

ఆమ టకు శారద, "క్లాసుల్లో చాలామంది మొగాళ్లతో కూర్చోడం, మాట్లాడ్డం ఉంటుందిగా, అందువల్ల మనం ఎవణ్నో ఒక మొగాణ్ణి ప్రేమించడం, వాడు మనని ప్రేమించడం తటస్థిస్తుందట. అప్పుడింకేముంది?" అని జవాబు చెప్పి ఫకాల్న నవ్వుతే ఉష వూరుకోదు.

"ప్రేమించేసి పట్టపగలే ఆ మొగాణ్ణి పట్టుకుపోయి సాయంకాలం ఆరయ్యేసరికి యింటి కెళ్ళాలిగా," అనేది ఇంకా గట్టిగా నవ్వుతూ.

ఆడది యెక్కువ చదువుకుందనీ, మొగాడు తక్కువ చదువుకొన్నాడనీ, ఆ ప్రశ్నే రాకూడ దంటుంది ఉష. అయితే యీ తెలివితేటలన్నీ యీమధ్యనే వచ్చాయి ఉషకి. ఇంటర్మీడియట్ పూర్తయి, బి. ఎస్. సి. లో శారదస్నేహం కలిగేవరకూ, పెళ్లి అన్నది చేసుకోకూడదనీ, మొగజాతి ప్రవర్తన అతి చండాలమైనదనీ, అందులో చదువుకోని మొగాళ్లు బ్రూట్సనీ అనుకొనేది. కుర్రతనంలోంచి పూర్తి యవ్వనంలోకి మారే మధ్యరోజుల్లో, యిట్లాంటి అభిప్రాయాలు సాధారణంగా వుడుతూ వుంటాయి. ఈ ఆలోచనలే ఉషని సుందరంతో మాట్లాడనియ్యకపోయివుండవచ్చు. అయితే ఇప్పుడిన్ని తెలివితేటలు వచ్చిన తర్వాతకూడా సుందరంబావనుంచి తనెందుకు తప్పుకుతిరుగుతోందో ఉషకే అర్థం కావడం లేదు. తనకి బావని పలుకరిద్దామని బుద్ధిపుట్టినప్పుడల్లా, లోపల్నుంచి ఏదో మొండిచెయ్యి కారణం చెప్పకుండా వెనక్కి లాగేస్తుంది. పెళ్లిఆలోచన వచ్చినప్పుడల్లా ఉష అనుకొనేది "చదువుకుంటే మాత్రం తప్పా, బావా నేనూ ఎంతో సరదాగా ఉండేవాళ్లం" అని. ఆ ఆలోచన తలకాయలోంచి పోగానే మళ్లీ "మరయితే బావతో మాట్లాడ నేం?" అని ప్రశ్నించుకుంటుంది. మాట్లాడ్డం మొదట్లో మానెయ్యడంవల్ల అదే అలవాటయి గొంతుక విప్పనివ్వడంలేదు. పోనీ మొగాడు బావైనా పలుకరిస్తాడేమో అంటే, అతనూ నోరు మెదపడు. పైపెచ్చు కలివిడిగా వున్నట్టే వుంటాడు......

ఉషపరీక్షల సంగతి పేపర్లో పడింది. కూతురి పరీక్షపోయిందని తెలియగానే, తన కుమార్తె ప్రజ్ఞకి లోపంవచ్చిం దని సీతమ్మగారు బాధపడి కూతుర్ని ఏమీ అనలేక ఊరుకుంది. పోతేపోయింది వెధవపరీక్ష. ఇంక ఆ పుస్తకాల జోలికి వెళ్ళకూడ దనుకుంది ఉష. ఎంచేతనంటే ఇప్పుడామె మనస్సంతా పెళ్లి, భర్త, ముం దనుభవించవలసిన సుఖాలూ, వాటిమీదనే వుంది. తెల్లటి లుంగీ కట్టుకుని,చేతుల్లేని బనీను తొడుక్కొని అటూ ఇటూ చురుగ్గా తిరిగే బావని చూస్తే ఆమెలో కలిగే భావాలు ఆమెకు వింతగా ఉన్నాయి. ఎప్పుడూ కొంటికుర్రాళ్లమధ్య కూడా చురుగ్గా మెలిగే ఉషకి, అదోరకం వికారం చలనం ఇప్పుడే ప్రారంభ మయింది. సౌష్టవమైన శరీరం కల బావను అస్తమానం చూస్తున్న ఉషకు మనస్సు చికాకుపడ్డానికి ప్రారంభించింది. అది ప్రారంభించాలే కాని ఆ తరవాత ఇంక అదీ చికాకు. ఈ చికాకు మనస్సులో ప్రవేశించినదగ్గర్నుంచీ ఏమైనాసరే బావతో మాట్లాడేద్దాని అనుకుంటోంది ఉష. కాని సాధ్యపడ్డం లేదు. అయితే బావతో మాట్లాడ్డానికి కావలసిన ధైర్యానికి తాను క్రమంగా దగ్గర పడుతున్నట్లు గ్రహించుకుంది.

పైలట్ వుద్యోగానికి మెద్రాస్ లోని ఏర్ వేస్ కంపెనీకి పెట్టిన దరఖాస్తుకి సమా

ధానం వచ్చింది. సుందరానికి, ఇంటర్వ్యూకి రమ్మని ఏర్ వేస్ వాళ్లు వ్రాశారని తల్లితో చెప్పగానే, ఆవిడ అంతగా సంతోషించకుండా "ఉద్యోగం మానేసివచ్చి నాదగ్గిరే వుంటా వనుకుంటే, మళ్లీ యిదేమిట్రా" అన్నది.

సమాధానానికి సుందరం అంతగా ఆలోచించలేదు. "మిలిటరీకన్నా యిది చాలా నయం అమ్మా, అక్కడ వున్నన్ని కట్టుబాట్లు యిక్కడ వుండవు. అదీగాక, యిట్లా యింట్లో కూర్చుంటే నాలుగురోజులికి నాకే అసహ్యమేస్తుంది. అయినా యింకా వుద్యోగం కాలేదుగా" అని అక్కడ ఆగి, "ఎప్పు డెళ్లమన్నా వమ్మా" అన్నాడు.

లక్ష్మమ్మగారు "నీ యిష్టం బాబూ" అనగానే సుందరం "రాత్రి బండికే వెళ్తానమ్మా, పట్నంలో చూసుకోవలసిన పని కూడా వున్నది" అని జబా బిచ్చాడు. సరే వెళ్లమని చెప్పేసి లక్ష్మమ్మగారు ఇంట్లోకి వెళ్లిపోయింది. అప్పటి కప్పుడే సాయంకాలం అవుతుండడంవల్ల, హోల్డాలు సర్దుకోడానికి తన గదిలోకి వెళ్లాడు సుందరం.

"ఇవ్వాళ చతుర్దశి రేపు పోనిచ్చి యెల్లుండి వెళ్లకూడదురా" అంటూ క్యాలండరు పుచ్చుకొని వచ్చింది లక్ష్మమ్మగారు. అప్పటి కప్పుడే సుందరం హోల్డాలు బిగించెయ్యడంవల్ల "కట్టేశానే!" అన్నాడు తల్లితో. కాని—

"కట్టేస్తే యేంలే, పడుకోడానికి పక్కలేదా యేమిటి?" అని తల్లి అన్నమీదట ఆవిడమాట తీసెయ్యలేక ప్రయాణాన్ని ఆపేశాడు.

రాత్రిభోజనా లయిపోయాయి. భోజనం అవగానే నడుం వాలుద్దామన్న వూహతో పైకి వచ్చి వరండాలో వున్న మంచాన్ని వాల్చుకుని ఒక తలగడా తలక్రింద పెట్టుకొని విశ్రమించాడు. సుందరం బయటకు వచ్చిన కాస్సేపటికి సీతమ్మగారూ, ఉష, వరండాకి ఎడంవైపుగా వున్న వాళ్ల గదిలోకి వెళ్లిపోయారు. ఉష, సీతమ్మగారూ పడుకొనే యీ గదిలోంచి వరండాలో పడుకొన్న సుందరం బాగా కనిపిస్తాడు. తన బావ కొద్దిదూరంలో ఎదురుగా పడుకున్నందువల్ల ఉష సిగ్గుపడి వెనకమంచం మీద పడుకుని, తల్లిని ముందుమంచంమీద పడుకోబెట్టింది. అంతేగాని అతనికి కనబడకుండా మంచాన్నిమాత్రం మార్చుకోలేదు.

పదిగంట లయివుంటుంది. అందరూ నిద్రపోయారు. అయితే ఆ యింట్లో వున్న ఇద్దరికిమాత్రం నిద్ర పట్టడంలేదు. ఒకరి బాధ ఒకరికి తెలియక, తనొక్కర్తే లేచి ఉందని ఉషా, తనొక్కడే లేచివున్నాడని సుందరంమాత్రం అనుకుంటున్నారు. వారిద్దరికీ నిద్రపట్టకపోవడానికి కారణం ప్రకృతిదే అవడంవల్ల "ఆలోచనలుంటేమాత్రం, నిద్ర ఎందుకు పట్టకపోవాలీ అన్న ప్రశ్నకి సమాధానం దొరకడంలేదు వాళ్లిద్దరికీ.

వెన్నెట్లో తెల్లగా కనిపిస్తున్న సుందరం ముఖం ఉషని కలతపెడుతోంది. అర్ధరాత్రివేళ బావని వెళ్ళి లేపుతే యింకేమైనా వుందా, అని తర్వాత అనుకున్నా, సహజంగా వచ్చే ఒక ఆలోచనమాత్రం ఉషకి రాకమానలేదు — "చాలా బాగా కనిపిస్తున్నాడు. లేపి పలకరిస్తే యేం" అని. ఇట్లాంటి ఆలోచనలకి అర్ధం చాల తక్కువని వెంటనే అనుకొని రెండోప్రక్కకి ఒత్తిగిలింది ఉష బలవంతంగా.

పైకి ఉబికి రాబోయే మనోభావాల్ని అణచిపెట్టుకొని అట్లా ఉష నిద్రపోవడానికి ప్రయత్నిస్తూ వుంటే, ఇటు సుందరం చాలా చిత్రమయిన ఆలోచనలకి లొంగిపోతున్నాడు. అమ్మను ఉషకి తనంటే యిష్టం వుందో లేదో అడగమందామన్న ఆలోచనతో బయలుదేరి, యిష్టమే వుంటే ఉష ఇట్లా ప్రవర్తిస్తుందా అని తర్జనభర్జన చేసుకుంటున్నాడు. ఇద్దరికీ ఒకప్పుడు ఇష్టమున్నప్పటికీ, ఉష చదువుకున్నానన్న గర్వంతో ముందుముందు ఎట్లా ప్రవర్తిస్తుందో అనుకుంటూవుంటే ఏదో ఆలోచన చటుక్కున తట్టింది. దాంతో మనిషి ఒక్కసారి గంభీరుడైనాడు. తట్టిన ఆలోచనకి అర్ధసందర్భం ఏమాత్రం లేదనుకుని కళ్లు గట్టిగా మూసుకున్నాడు. ఎంత గట్టిగా మూసుకున్నా ఆ ఆలోచన మనస్సుని వదలలేదు. ఏ నిమిషానికే మనిషిప్రవృత్తి ఎట్లా మారుతుందో ఎవరికీ అర్ధం కాదు. మనస్సుయొక్క సారథ్యం ఒకొక్కప్పుడు అర్థంలేకుండానూ, అసందర్భంగానూ వుంటుంది. అందులో, మనస్సు ఈ ఆలోచనల్ని పుట్టించడంతో వదలకుండా ప్రోద్బలం కూడా ఇచ్చిందంటే, చాంచల్యానికి లొంగే బుద్ధివున్నవా డెవడూ తప్పించుకోలేడు.

ఆలోచనలవల్ల ఉద్భవించిన మైకం ఒక్కసారి అతన్ని కూర్చోపెట్టింది. అతను అట్లాగే ఒక్కనిమిషం వుండిపోయి "ఇప్పుడు పారిపోవడం దేనికి? పెళ్లి సమస్య ఏదైనా వురిశిక్ష కాదుగదా పారిపోడానికి? నాకింత పిరికితనం దేనికి? పారిపోతే అమ్మ ఎంత యేడుస్తుందో?" అనుకుని మళ్లీ పడుకున్నాడు. సుందరం లేవడం పడుకోవడం ఉష కనిపెట్టింది. కాని అతని మనస్సులోని జిజ్ఞాస ఆమె కేం తెలుస్తుంది? బావకూడా తనకుమల్లేనే మాట్లాడ్డానికి లేచి, సంకోచించి మళ్ళా పడుకొన్నాడు అనుకుందే గాని, పిచ్చిఆలోచనలమధ్య కొట్టుకుంటున్నాడని ఆమెకి తెలియదు.

పిచ్చిఆలోచన్ల మైకంలో రేగిపోతున్న సుందరం లేచి సాయంకాలం బిగించిన హోల్డాలు వున్న గదిలోకి వెళ్లేదాకా, అతని భావతరంగాల్లో వున్న అర్ధరాహిత్యం పూర్తిగా అతనికి వ్యక్తం కాలేదు. తను మగవాడవడ మేమిటి, తన పెళ్లి ఏమిటి నేడోరేపో యింటర్వ్యూకి వెళ్దామనుకోవడ మేమిటి, ఇప్పుడు అర్ధంకాకుండా తెలివితక్కువగా పిరికితనంతో పారిపోవడానికి లేవడ మేమిటి? అసలు తను పారిపోవడం ఎందుకు? ఎవరైనా ఏమైనా బలవంతం చేశారా, లేదే! అంతా తన భుజాన్నే వేశారా? ఇంకా నయం, ఎవరైనా చూశారు కాదు. అనుకుని నవ్వుకుని అలాగే హోల్డాలుదగ్గరే కూచుండిపోయాడు.

బావ లేవడం చూసిన ఉష మొదట తనతో మాట్లాడ్డానికే వస్తున్నా డనుకుంది. అతను లోనికి వెళ్లడం చూసి దెబ్బ తిన్నది. లేచి కూర్చుంది.

"బావ ఇంకేదో పనిమీద లేచి వుంటాడు. నేను పొరపాటుపడ్డాను. అనుకొంటే అనుకొన్నానుగాని, ఇప్పుడు లోపలే వుంటాడుకనక వెళ్లి మాట్లాడతా" అనుకుని ముందూ వెనకా ఆలోచించుకోకుండా, నెమ్మదిగా గదిలోకి వెళ్లి హోల్డాల ముందు నిలబడి, తపస్సుచేస్తున్నవాళ్ళా వున్న సుందరాన్ని చూచింది. అయితే అతనట్లా యెందుకు నిలబడివున్నాడో స్ఫురించలేదామెకు. నెమ్మదిగా "బావా" అన్నది. ఈ నిమిషానికి ఉష తన వునికినీ, తన శరీరాన్ని మర్చిపోయిందనకోవచ్చు.

సుందరం వెనక్కి తిరిగి చూడకపోయినా, ఈ ప్రపంచంలోమాత్రం పడ్డాడు. పరిస్థితిల్లా వచ్చిన ఈ హఠాత్పరిణామాన్ని గురించి ఆలోచించుకోడానికి ఇంక వ్యవధి

లేకపోయినా, గుండెమాత్రం గబగబా కొట్టుకోడం ప్రారంభించింది.

"ఊఁ" అన్నాడు. 'ఊఁ' అని చాలా మామూలుగా అనివుండవచ్చు. కాని ఉషకి మాత్రం ఆ సమాధానం చాలా అర్థవంతంగా కన్పించింది. ఆమెమనస్సులో మాట రూపం పొందలేక గిజగిజలాడుతోంది. అయితే ఆమె ఇచ్చిన జవాబులో ఖారం, మమకారం యెక్కువగా వుంది. తన్మయత్వంలో "నన్ను చూస్తే మాట్లాడాలని వుండదు. కోపమా ఏం?" అన్నది.

"నాకు ఎవరన్నా కోపం లేదు. నువ్వంటే అసలే లేదు"

"కోపం లేకపోవచ్చు, యిష్టమో?"

"నాయిష్టానికేంలే, సంస్కారం లేని వాణ్ణి. ఇష్టం లేకపోవడమే మంచిది. యెంచేతంటే ప్రయోజనం లేదుగనుక."

"నాకు తెలుసులే నీబాధ. ఇంతోటి నాచదువు నీ ఒళ్లో పెట్టుకొని రోజూ నీకు చూపిస్తూ కూర్చుంటా కాదూ? వంటా అదీ మానేసి, పేపరో, పుస్తకమో పుచ్చుకుని కుర్చీలో కూర్చుని, నీ అవస్థలు నిన్ను పడమంటా. అట్లా నాలుగురోజులు చలాయించి ఈ మొగు డేమిటి నాకు, ఏ కలక్టర్నో పెళ్లాడక. అని నిన్ను వొదిలేసి చక్కాపోతాను. సంస్కారం వున్నదాన్నిగా మరి?" ఉష పరిహాసమంతా నాలికచివర్న పోగయిందా అనిపించేటట్లు.

"అన్నీ నువ్వే అనుకొంటున్నావు" అన్నాడు సుందరం.

"అవునవును. నేనే అనుకొంటున్నాను. నువ్వు చాలా తెలివితక్కువవాడివిగా! నిన్ను లొంగదీసుకోవడం యెంతలే. పెత్తనం చెలాయించడానికీని."

ఈ మాటలు విన్నతరువాత, ఉబ్బిపోయో ఉష అన్నమాటలు నచ్చో తెలియదు, సుందరం ఉషవైపు మొహం త్రిప్పి - "ఇప్పుడేం చెయ్యను?" అన్నాడు.

"ఏమో నీ ఇష్టం" అన్నదామె.

"నా ఇష్టమేగా" అంటూ చిన్ననవ్వుతో ఒక్క అడుగు ముందుకు వేసి, వెనక్కిపోబోతున్న ఉషచేతుల్ని సున్నితంగా పట్టుకొని, ఒక చేత్తో ఆమె గడ్డాన్ని నిమిరాడు. నాజూకుగా. సుందరం చేసిన ఈ చిన్నచేష్ట ఉషను చాలా ప్రమాదస్థితిలోకి దించింది. నరాలన్నీ ఒక్కసారిగా బిగుసుకొని పోయాయి. గుండె దడ దడ కొట్టుకుంటోంది.

మంచంమీదనుంచి కూతురు వెళ్లడం గ్రహించిన సీతమ్మగారు, యేవో మాటలు వినపడగానే ఖంగారుపడి లోపలికి వెళ్లింది. కూతుర్నీ, హాల్డాల్నీ, సుందరాన్నీ చూసి, ఏం ఆలోచన తట్టిందోగాని, చప్పుడు కాకుండా లక్ష్మమ్మగార్ని లేపడానికి మేడమీదికి వెళ్లింది.

ఎవరైనా వస్తారేమో అన్న జ్ఞానమైనా లేకుండా లోపల గదిలో నిలబడివున్న వ్యక్తుల్ని లక్ష్మమ్మ, సీతమ్మగార్లిద్దరూ వచ్చి ఖంగారు పెట్టారు. సుందరం, ఏమైతే అయింది, ఖంగారుపడి లాభం లేదని ముఖం గంభీరంగా పెట్టుకూర్చున్నాడు. బావగారు మాట్లాడే స్థితిలో లేరని తెలుసుకుని ఉష ఒక సంజాయిషీ కల్పించింది. ప్రక్కనవున్న హాల్డాల్ని సాక్ష్యం చేసుకొని నెమ్మదిగా అన్నది "బావ ఎక్కడికో హాల్డాలు తీసుకొని వెడుతూవుంటే నేను లేచి అడ్డుకున్నాను" అని.

# ప్రభుత్వము-విమర్శకులు

(16-పేజీ తరువాయి)

పక్కన అంటూ, జమీందార్లకు ఇంకా ఎక్కువ పరిహారం ఇవ్వాలి, ప్రభుత్వం పౌరుల ఆస్తులను స్వాహాచేస్తోందీ అని అంటారు.

జమీందారులు తిన తిండి, కట్టుబట్ట లేని స్థితిలో ఉన్నారనిగాని, ఉండాలనిగాని ఎవ్వరూ అనరు. ఇతరపౌరుల్లా చెమటోడిస్తే, జీవించగలరు. నిజానికి వారికి కోట్లకొద్దీ పరిహారం ఇవ్వటం అనవసరం. కాంగ్రె ప్రభుత్వాలు కాబట్టి ఈ కనకాభిషేకం జరుగుతోంది. అప్పటికీ ఇంకా తృప్తిలేదు. ఈ నష్టపరిహారం పౌరులందరూ భరించకూడదని, ఆ పొలాల రైతులే భరించాలని ఒక వాదన. ఏళ్ళతరబడి వాళ్ళు జమీందారీశిస్తుభారంతో కుంగి కృశిస్తున్నారని అంటూ, మళ్లీ వాళ్ళ నెత్తినే ఈ పదికోట్ల భారం పెట్టితే? ఈ రైతాంగాన్ని పీల్చి, పిప్పిచేసి, జమీందార్లు ప్రభుత్వాని కిచ్చే డబ్బులో పౌరులంతా ఇదివరకల్లా ప్రభుత్వం ద్వారా వసతులను పొందారు. ఇప్పుడీ భారం వహించటం బేసబబు కాదు.

తాగుబోతులద్వారా ప్రభుత్వాదాయంలో మూడోవంతు వచ్చేది. ఆ డబ్బుతో పౌరులందరకూ ప్రభుత్వం వసతులు కల్పించింది. ఇప్పుడు మద్యపాననిషేధాన్ని అమలుజరపటానికయ్యే ఖర్చు పౌరులంతా ఎందుకు భరించాలీ అంటే?

కాబట్టి విమర్శకు లక్ష్యం ఉండాలి? ప్రజల్లో ఏకరగతివారి అభ్యుదయం లక్ష్యం? దరిద్రులు, బీదరైతులు, కార్మికులు, తక్కువజీతాల ఉద్యోగస్థులు, వీరి అభివృద్ధా లక్ష్యం? లేక అల్పసంఖ్యాకులైన లక్షాధికార్లు కోటీశ్వరులవటమా లక్ష్యం? అన్నితరగతులవారి అభివృద్ధి లక్ష్యం అనికొందరంటారు. ఇది తప్పు వాదన. లక్షాధికారిని కోటీశ్వరుడిని చేయటం, దరిద్రుడినుద్ధరించటం ఈ రెంటిలో ఏదో ఒకటే సాధ్యమౌతుంది. కాని రెండూ నెరవేరవు.

ప్రభుత్వవిధానాలను విమర్శిస్తే చాలదు. ఆ విధానాల బదులు అంతకంటె మంచి విధానాలను సూచించగలగాలి. అప్పుడే విమర్శవల్ల ఉపయోగం. అప్పుడే విమర్శనాస్వాతంత్ర్యంవలన ప్రజలశ్రేయస్సు అభివృద్ధి చెంది, ప్రజాస్వామ్యం సుస్థిరం కాగలదు.

భారం ప్రజాస్వామ్యంలో ప్రభుత్వం నిర్వహించేవారికే కాదు. విమర్శకులకూ బాధ్యత ఉంది. ప్రభుత్వాధికారం తమకు లభించినా, లభించకపోయినా, అంత బాధ్యతా వహించినట్టే మెలగాలి-విమర్శకులు. తమ ప్రణాళికలు, కార్యక్రమాలు ప్రభుత్వవిధానాలకంటే ఇంకెక్కువగా ప్రజల శ్రేయస్సు కుపకరించేట్టు ఉండాలి. అలా అని రుజువుచేయాలి.

శాసనసభలో ఉపన్యాసాలు జోరుగా ఇవ్వటం కాదు విమర్శకుల కర్తవ్యం. తమ తమ నియోజకవర్గాల్లో తమకు తోచిన నిర్మాణకార్యక్రమాలను ఏర్పరచి, కొనసాగించగలిగినప్పుడే, తమ ధర్మాన్ని నిర్వర్తించగలిగినవారవుతారు.

ప్రభుత్వాన్ని ప్రజలెలా ఒక కంట కనిపెట్టుతూవుంటారో, అలానే విమర్శకుల మాటలనే; కాదు; చేతలనకూడా రెండో కంట కనిపెట్టుతూఉంటారు. ఉండాలి.

# ప్రకృతిమాతకు పుట్టిల్లు బ్రెజిల్

(13-వ పేజీ తరువాయి)

వేశారు. కెనడాదేశస్థులు కూడా యిక్కడి కరెంటుకు సంబంధించిన పరిశ్రమలకు చాలా పెట్టుబడి పెట్టారు. బ్రెజిల్‌లోని ప్రజల్లో జాతీయప్రబోధం కలిగినప్పటినుండి విదేశీపెట్టుబడిదార్లకు జంకు కలిగింది. కొన్ని షరతులమీద విదేశీపెట్టుబడి బ్రెజిల్‌లో వుంచుతామని పెట్టుబడిదార్లు బ్రెజిల్‌ప్రభుత్వాన్ని కోరారు. వారి షరతులు బ్రెజిల్ ప్రజలకు కష్టంగా వున్నాయి. బ్రెజిల్‌లో క్రొత్తక్రొత్త పరిశ్రమలు స్థాపించి దానిని ఆధునిక పారిశ్రామిక దేశంగా మార్చడం అక్కడి ప్రజలకు యిష్టం లేదు. బ్రెజిల్ యువకుల్ని టెక్నీషియన్లుగా తయారుచేసే విషయంలో ఎవ్వరూ శ్రద్ధ వహించలేదు. యుద్ధకాలంలో యీ పరిస్థితి మారింది. గూడ్ నెయిబర్ పాలసీవల్ల కూడా బ్రెజిల్‌కు చాలా లాభించింది.

బ్రెజిల్‌లో మేలురకపు బొగ్గు, కిరసనాయిల కొరత వున్నదని పైన పేర్కొన్నాము. గత కొద్దిమాసాలనుండి చాలా నూనెగనుల అభివృద్ధివిషయంలో విదేశీపెట్టుబడిదార్లతో రాజీ కుదరకపోవడంవల్ల అనేకమంచిప్రణాళికలు కాగితంమీదనే వుండిపోవలసివస్తూ వుంది. బొగ్గు, నూనెలకొరతవల్ల రాకపోకల సాధనాల అభివృద్ధికూడా బ్రెజిల్‌లో జరగడంలేదు. బ్రెజిల్‌లో యిప్పుడున్న కంపెనీలన్నీ చాలా లాభసాటిగా సాగుతూ వున్నాయి. 1942 లో రెండువందలయాభైఆరు కంపెనీలకు సుమారు 34% లాభం వచ్చింది. వీటిలో అరవైతొమ్మిది కంపెనీలకు సుమారు 50% అధికలాభం వచ్చింది. 1944 లో ఒక బట్టల మిల్లుకు 4000% లాభం వచ్చింది. అంటే ఒక్క సంవత్సరంలో వచ్చిన లాభంవల్ల మిల్లునిర్మాణానికి అయిన వ్యయం 40 రెట్లు వచ్చిందన్నమాట. ఇప్పుడు యింతలాభం ఏ కంపెనీకీ రావడంలేదు. ప్రభుత్వం యీ పరిశ్రమల మీద అజమాయిషీ ప్రారంభించింది. చాలా పరిశ్రమల్లో ప్రభుత్వం షేర్లుకూడాకొన్నది.

బ్రెజిల్‌లోని శ్రామికుల పరిస్థితి అంత సంతోషజనకంగా లేదు. కూలి స్వల్పం. ప్రియంవల్ల కూలీల జీవితపరిమాణం పెరిగినా కూలిమాత్రం తక్కువే. రైల్వేలలోను, బట్టల మరలలోను సిమెంటుఫ్యాక్టరీలలోను పనిచేసే కూలీలునిరంతరము యజమాన్లతో ఘర్షణపడుతూవుంటారు. శ్రామికుల సౌకర్యార్థం ప్రభుత్వంచాలా చట్టాలు చేసింది. కాని పెద్దపెద్ద పట్టణాలలో తప్ప యింక యితరచోట్ల యీ చట్టాల్ని పాటించరు. వీటిని అమలులో పెట్టించే ఏర్పాటు లేకపోవడమే అక్కడి లోటు.

బ్రెజిల్‌లో పారిశ్రామికాభివృద్ధికి ప్రాతినిధ్యం వహించే నగరం సావపాలో. ఇక్కడ 4500 ఫ్యాక్టరీలున్నాయి. ఇక్కడ తయారయే ఉత్పత్తిసామగ్రి దేశవాడవాడలకూ వెళుతుంది. 1, 50, 00, 000 కాఫీ గింజలబస్తాలు యిక్కడినుండి యావత్ప్రపంచానికి వెళుతాయి. 1872లో యీ నగర జనసంఖ్య 26000, 1920లో 69000, 1947లో 1700000. అంటే ప్రతిఏటా 70000చొప్పున జనసంఖ్య పెరుగుతూ వున్నదన్నమాట. సుమారు 10 సంవత్సరాల్లో బ్రెజిల్ రాజధాని "రాయోడిజనరో" కంటె కూడా "సావపాలో" మహత్వం పెరుగుతుందని అక్కడి ప్రజల అంచనా. కేంద్రప్రభుత్వం విధించే పన్నుల్లో 75 వంతులు కేవలం సావపాలోయే చెల్లిస్తుంది. మిగతా 25వంతులు మొత్తం బ్రెజిల్‌లోని మిగతా 19 రాజ్యాలు కలిసి చెల్లిస్తాయి.

సావపాలో రాజ్యపు జనసంఖ్య 8000000. బ్రెజిల్‌లోని యితర రాజ్యాలన్నిటికంటే దీని జనసంఖ్య అధికం. తనలోని ప్రజలకే గాక తన సరిహద్దుకు సమీపంలో వుండే సుమారు 4000000 ప్రజలకు కూడా సావపాలో రాజ్యం పని కల్పిస్తుంది. ఛేంబర్ ఆఫ్ డిప్యుటీస్‌లోని ప్రతినిధులలో సావపాలో రాజ్యపు ప్రతినిధుల సంఖ్యయే అధికం. సావపాలోనగరం బ్రెజిల్ రాజ్యానికి ప్రారిశ్రామిక రాజధానీనగరమే గాక దక్షిణఅమెరికాలోని మహత్తరమైన నగరాలలో కూడ ఒకటి.

ఇప్పటివరకు బ్రెజిల్, వ్యవసాయప్రధానమైన దేశంగా వుంది. దాని సమృద్ధిఅంతా కాఫీదిగుమతిమీద ఆధారపడివుంది. ఎప్పుడైనా అంతర్జాతీయబజారులో కాఫీధర తగ్గితే బ్రెజిల్, ముందు ఆర్థికసంకటాన్ని యెదుర్కొనవలసి వచ్చేది. కాని ఇంకా అనేకపరిశ్రమలు అక్కడ అభివృద్ధి చెందడంవల్ల, దేశపు ఆర్థికస్థితి కుదుటబడుతుందని బ్రెజిల్ పౌరులకు యిప్పుడు ధైర్యం కలిగింది.

బ్రెజిల్ దక్షిణఅమెరికాలోని అన్నింటికంటె పెద్ద దేశం. అది తన శక్తిని గుర్తించి, దానిని సరీగా వినియోగించుకొంటే మాత్రం ప్రపంచంలోని గొప్ప దేశాల్లో స్థానం పొందుతుంది. యిప్పుడు బ్రెజిల్ పౌరుల్లో చాలా ప్రబోధం కలిగింది. వారు తమ దేశ ప్రకృతిసంపదను గుర్తించారు. వారి ఉత్సాహం చూస్తే మాత్రం తమ దేశాన్ని స్వర్ణభూమిగా మార్చివేయగలరనే విశ్వాసం తప్పక కలుగుతుంది.

# పశ్చిమ యూరప్‌లో

(6 వ పేజీ తరువాయి)

ఏ ప్రభుత్వోద్యోగుల తనిఖీలతోనూ పత్రాలతోనూ నిమిత్తంలేకుండా జరిగిపోయేది. కోరినంతద్రవ్యం (ఏరకానిదైనాసరే) ఎక్కడికి పడితే అక్కడికి తీసుకుపోవడానికి అభ్యంతరం ఉండేది కాదు. ఇష్టం వచ్చినట్లు మార్చుకోడానికి వీలుండేది. ఏ ప్రభుత్వంఅనుమతీ అవసరం లేకపోయేది. ఆనాడు ఒకవిధంగా పశ్చిమయూరప్‌లో ఆర్థికసమైక్యత ఉండేది.

ఆ సమైక్యత అప్పుడెలా సంభవించింది? ఏ ప్రభుత్వాలూ పనికట్టుకుని కార్యక్రమాలు నిర్ణయించలేదు. ప్రజల్ని స్వేచ్ఛగా వ్యాపారంచేసుకోనిచ్చేవారు. ద్రవ్యమారకాలూ అవీ ప్రజలకే విడిచిపెట్టేవారు.

ఇప్పుడు బెల్జియం, స్విట్జర్లండ్ దేశాలు రెండే వానిమధ్య అన్ని నిర్బంధాల్నీ రద్దుపరచుకున్నాయి. అంతర్జాతీయఆర్థిక స్వేచ్ఛకోసం ఈరెండుదేశాలు తీవ్రకృషి చేస్తున్నాయి. రెండుదేశాలమధ్యనూ వర్తకం స్వేచ్ఛగా నడుస్తోంది. ఈ దేశాల మాదిరిగానే పశ్చిమయూరప్‌లోని దేశాలన్నీ వ్యాపార నిర్బంధాల్ని తొలగిస్తేనే ఇకముందు ఆర్థికసహాయం ఇవ్వగలరని అమెరికా ఒత్తిడి చెయ్యాలి.

పశ్చిమయూరప్ దేశాలు వాని అంత అవి వ్యాపారస్వేచ్ఛ కలిగించలేవు. అమెరికా ఒత్తిడిచెయ్యక తప్పదని కొందరు యూరోపియన్ రాజకీయవేత్తలే అంటున్నారు. ఆర్థికంగా పశ్చిమయూరప్ ఏకమైతేనే ఆ ప్రాంతానికి భవిష్యత్తులో మేలు కలుగుతుంది. [రీడర్స్ డైజెస్ట్‌నుంచి]



# తాళ్ళపాకవారి పదములు

శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ

౪౯

(సంపు. ౩ : పదం. ౧౩౭)

పెదతిరుమలయ్యాగారి రచన

పాడిరాగం - త్ర్యస్రత్రిపుటతాళం

[పల్లవి]

(౧) , సరిమా మా । పా , మా , పా ధా । , ప మ పా , , । , , పధపమరీసరి

మా కే మి మీ రె ట్లు న్నా మం చి దే నే । డు

(౨) స ని స రి పా , మ । ప మ రి మా , ప మ పా ధా । , పధ పధ పా , , , । ,,

మా కే మి మీ రె ట్లు న్నా మం చి దే

(౩) , సరిధధపప మా మ । పనురి మరిమ పమపా ధా । , పమపా నీ , , । సనిపాధా పధపమరీసరి

మా కే మి మీ రె ట్లు న్న మం చి దే నే డు

(౪) సని సా , రి రిమ.మప మపదప మా । ,, । , పమపనిసా , సరి । సని పగపమ పధపధపమరీ

మా కే మి మం చి దే నే డు

స ని (మాకేమి)

[అనుపల్లవి]

(౧) , సా , రి సరిమా రీ । సా , సా , ని సరి సా

పై కొ ని మీ వా ర మై

(౨) , సా , రి ధగపమ రీ । సా ర సా రి సనిసరి సా

పై కొ ని మీ వా ర మై

(౩) , సా , స సనిపధ పమ మా , । గపమ రీ , సనిసరి సా । , స రి సరిమప ధా । పా పాధ ప మా

పై కొ ని మీ వా ర మై బ్రతి కే ము మే

పమ రీ సరి ॥ సని (మాకేమి)

[చరణం]

, ప ధ పా పా | మ ప ధ ధ ప మ రీ మా | , రీ మ ప ధా | పా , ధ ప మ ప ధ పా |
చె ప్పి న ట్టు చే సే టి చే.కొ ల ది మ గ డా యె

, స రి స రి మ ప ప మ రీ | సా రి స స ని స రి సా | , సా , రి రి మా రి మ పా మ | మ ప ధా దా పా , ,
అ ప్పు డే స లి గె గ ల ఆ ల వై తి వి

, ప మ పా నీ | సా , రి స ని స రి స రి సా | , స రి స రి షా రీ | స ని స రి స రి స ని పా పా ద మ
చె ప్ప రా ని సం తో షా ల జె లు లె ల్ల బొ గ డే రు

, ప ని స రి స రి స ని పా | పా , ధ ప మ ప మ రీ మా | , స రి స రి మ ప ధా | పా పా ధ ప మా ప మ రీ
చి ప్పి ల గ న వ్వ వ మ్మా సె ల వు ల నిం క

సా సా రి స ‖ నీ (మాకేమి)
ను

ఇట్లే క్రిందిచరణములు :

(౨) కచ్చుపెట్టి నీ కతడు - కాపురము సేసీని,
ఇచ్చకుగాలవు తొల్లే - యితనికిని ;
వచ్చివచ్చి చూచే - వాసవాగల్లా మిమ్ము ;
ముచ్చటలాడవమ్మా - మదితల తోడను ‖ (మాకేమి)

(3) దక్కి శ్రీ వేంకటేశుండు - తమ్ముల మిడెను నీకు ;
తక్కక నీ కట్టె మ - దన మెత్తెను ;
అక్కరతో నీ విభుని - అంతలోనే కూడితివి ;
సొక్కుచు బాడవమ్మా - సోబానపాటలు. (మాకేమి)

లఘుటీక : వేంకటేశ్వరుని ప్రణయము సంపాదించుకొన్న క్రొత్త పెండ్లికూతురి పెకును జూచి అనుభవరసికలైన ప్రౌఢగరితలు ఆడే గడుసుమాటలు పదకస్తువు.

పైకొని = మీరు మమ్ము లక్ష్యం చేయకపోయినా మేమే ముందు పడి ; చేకొలది = కౌగిలింతకు నిండుగా గల ; సలిగెగల = చెప్పినదంతా చెల్లించుకొను శక్తిగల ; సెలవులక = పెదవితుదలదాకా ; కచ్చుపెట్టి = శ్రమపడి. కచ్చుకు లోగి అని యైనా కావచ్చును ; ఇచ్చకురాలవు = ప్రీతిపాత్రమైనదానవు ; మదనము = కామోద్రేకము, సోబానపాటలు = మంగళగీతాలు. 'ఈ సంబరాలు ఎన్నాళ్లు జరుగగలవనే తత్వం మే మంతా ఎరుగమా !' అని ధ్వని.

ముద్రితపాఠములు : తమ్ములమిడేను ; తక్కకనికట్టె ; అంకలోనె ; బొక్కుచు బాడవమ్మా.

# నేటి ప్రపంచం

(14 వ-పేజీ తరువాయి)

అమెరికా వైఖరి ఏరీతిగా ఉంటుందో స్పష్టపడలేదు. ఇంతవరకూ అమెరికన్ విదేశాంగమంత్రి చేసిన ప్రకటనలనుబట్టి మండలిలో జాతీయప్రభుత్వప్రతినిధినే బలపర్చగలరనే అభిప్రాయం ఉంది. అలా కాకుండా ఉభయులకీ సభ్యత్వం ఉండాలని అమెరికా పట్టుబట్టుతుందని కొందరంటున్నారు. ఇది సాధ్యం కాకపోవచ్చును. ఇద్దరికీ సభ్యత్వమిస్తే వీటిలో అధికారం ఎవరికుంటుంది? భద్రతామండలిలో శాశ్వతసభ్యత్వం ఎవరికుంటుంది? ఈ విషయం నిర్ధారణ కావలసిఉంటుంది. కాబట్టి అమెరికన్ ప్రభుత్వం ఏ నిర్ణయానికీ రావడం సులువు కాదు.

ఈలోగా ఈ సమస్యను పరిష్కరించడానికి ఐక్యరాజ్యసమితి ప్రధాన కార్యదర్శి ట్రిగ్వేలీ యత్నం చేస్తున్నాడు. ఆయా దేశాలలో ప్రభుత్వాలను అన్యప్రభుత్వాలు గుర్తించినా గుర్తించకపోయినా ఆ ప్రభుత్వాల ప్రతినిధులకు సమితిలో ప్రాతినిధ్యమివ్వడానికి అభ్యంతరపెట్టరాదని అమెరికా, బ్రిటన్, ఫ్రాన్సు, రష్యాలకు విజ్ఞప్తిచేశాడు. ఆ దేశాలలో ప్రభుత్వాలు అనుకూలపరిస్థితుల్లో పరిపాలన సాగించగలుగుతున్నట్లయితే ఆ ప్రభుత్వాల ప్రతినిధుల్ని సమితిలో చేర్చుకోవాలని ట్రిగ్వేలీ అన్నారు. చీనాలో ఏ ప్రభుత్వం అధికారాన్ని ప్రజలు ఆమోదిస్తున్నారో విచారించడానికి ఒక కమిటీని నియమించాలని సూచించారు. కాని ఈరీతిగా ఈసమస్య పరిష్కారం కావడం కష్టం. భారతప్రభుత్వప్రతినిధి ప్రవేశపెట్టిన సవరణప్రకారమే పరిష్కారం కావాలి. కాబట్టి అమెరికన్ ప్రభుత్వం తన వైఖరిని మార్చుకుంటేగాని ఇది పరిష్కారం కావడం అసంభవం.

అయితే ఈ కొత్తనియమంప్రకారం ప్రాతినిధ్యం నిర్ణయించబడితే, ఆయా ప్రభుత్వాలను హర్షించినా హర్షించకపోయినా సమితిలో ప్రవేశానికి అంగీకరించవలసివస్తే కొన్ని కొత్తసమస్యలు ఉత్పన్నం కాక తప్పదు. ముఖ్యంగా స్పెయిన్, కొరియా, ఇండోచీనా మొదలైన దేశాల సభ్యత్వానికి ప్రతిపాదనలు రావచ్చును. వియత్‌నమ్‌తరఫున బావోడాయ్, హోచిమన్‌ల ప్రాతినిధ్యంగురించి తగవులు రాగల అవకాశం ఉంది.

కాని భద్రతామండలి, అమెరికా చీనా సభ్యత్వసమస్యను పరిష్కారం చెయ్యకుండా చిరకాలం ఉండలేవు. కేవలం చీనాసభ్యత్వసమస్యవల్లనే ఏటంకంట్రోల్ సమస్య, తదితర సమస్యలు ఐక్యరాజ్యసమితిలో పరిష్కారమయ్యే అదను తప్పిపోతున్నదనే అభిప్రాయం ప్రపంచంలో ప్రబలమౌతున్నది. ఈ తగణాన్ని తప్పిపోనివ్వరాదని ఆంగ్లో-అమెరికన్ దేశాలపైన చిన్నరాజ్యాలు ఒత్తిడి తేవాలనే రష్యా ఆశయం. రష్యా వేసిన ఈ ఎత్తు సఫలమయ్యే సూచనలుకూడా కానవస్తున్నాయి. అందువల్లనే రష్యన్ నాయకులు పదేపదే శాంతిసాధనసూచనలకు ఏటంకంట్రోల్ సంప్రదింపులకు రష్యా సంసిద్ధంగా ఉందని చెప్తున్నారు.

## తూర్పుజర్మనీలో ఎన్నికలు

తూర్పుజర్మనీ 1950 అక్టోబరులో ఎన్నికలు జరపడానికి నిశ్చయించబడింది. ఈఎన్నికల సందర్భంలో తూర్పుజర్మనీ కమ్యూనిస్టుపార్టీ జర్మనీ ఐక్యతాసాధన తమ ముఖ్యలక్ష్యమని నివేదికలో ప్రకటించింది. సార్‌తో ఫ్రాన్సు చేసుకున్న ఒడంబడిక రద్దుకావాలనీ, సార్ ప్రాంతంపై హక్కులికి పశ్చిమజర్మనీ ప్రభుత్వం నీళ్లు వొదులుకుందని కమ్యూనిస్టులు ప్రచారంచేస్తున్నారు. ఈ ప్రచారానికి పశ్చిమజర్మనీలో అనేకులు లొంగుతున్నారనీ, ప్రజల్లో పూర్వపుజాతీయవాదం తిరిగి ప్రబలమౌతున్నదనీ, జాతీయవాదులు పశ్చిమజర్మనీప్రభుత్వానికి విరుద్ధంగా ప్రచారం చేస్తున్నారనీ అమెరికన్ అధికారవర్గం అంగీకరించింది. పశ్చిమజర్మనీలో కమ్యూనిస్టుల ప్రాబల్యాన్ని నిరోధించడం నానాటికి కష్టమౌతున్నది. బ్రిటిష్‌సైన్యాల ఆక్రమణలో ఉన్న ప్రాంతంలో భారీపరిశ్రమల్ని బ్రిటిష్‌అధికారులు ధ్వంసం చేస్తున్నందువల్ల కార్మికుల్లో అసంతృప్తి తీవ్రతరమౌతున్నది. జర్మనీలో యుద్ధపరిశ్రమలు వృద్ధికాకుండా జాతీయవాదుల్ని అణచిఉంచడంకోసమే ఈరీతిగా చేస్తున్నట్లు బ్రిటిష్‌అధికారులు చెప్తున్నప్పటికీ వారి మాటల నెవ్వరూ నమ్మడంలేదు. వాస్తవానికి ప్రపంచవాణిజ్యంలో జర్మన్ పరిశ్రమలు తమ పరిశ్రమలతో పోటీచేస్తే పోటీకి నిలవలేరని బ్రిటిష్‌వారికి తెలుసును. అందువల్ల ఈపోటీ లేకుండా చెయ్యడానికే జర్మన్ పరిశ్రమల్ని ధ్వంసంచేస్తున్నారని అమెరికన్ పత్రికలుకూడా వ్రాస్తున్నాయి. ఇలా ధ్వంసం చేస్తున్నందువల్ల పశ్చిమ జర్మనీలో వేలు లక్షలమంది జర్మన్ కార్మికులకు జీవనాధారం పోతున్నది. నిరుద్యోగసమస్య తీవ్రమౌతున్నది. అందువల్ల ప్రజల్లో ఆంగ్లో అమెరికన్ ఫ్రెంచి ఆక్రమణాధికారులపట్ల అసంతృప్తి ప్రబలమౌతున్నది. కమ్యూనిస్టుల ప్రచారానికి ప్రజలు లోబడిపోతున్నారు.

ఈ పరిస్థితిని అమెరికన్ అధికారులు గ్రహించి చక్కబరచాలనే ఉద్దేశంతో కృషి చేస్తున్నారు. కాని ఫ్రెంచి-సార్ ఒడంబడికసందర్భంలో అమెరికన్ల యత్నాలు విఫలమైనాయి. ఫ్రెంచివారు అమెరికన్ల మాట వినలేదు. సార్ ప్రాంతంలో బొగ్గుగనుల్ని 50 ఏళ్లు నిర్వహించి బొగ్గును ఫ్రాన్సుకు రవానా చేసుకోడానికి ఫ్రెంచిప్రభుత్వం నిశ్చయించుకుంది. ఆరీతిగానే సార్‌ప్రాంతప్రభుత్వంపైన ఒత్తిడితెచ్చి ఒక ఒడంబడికను అంగీకరింపచేసింది.

జర్మనీఐక్యత పేరుతో కమ్యూనిస్టులు చేస్తున్న ప్రచారానికి ప్రతీకారంగా

(40 వ పేజీ చూడుడు)

గల్పిక:

# కలవారి అగచాట్లు

శ్రీ కొడవటిగంటి కుటుంబరావు

ఎవరో తలుపు తట్టారు. వెళ్లి తీశాను. ఎవరో తెలుగాయనే. "క్షమించండి. నే నీపక్క ఇంట్లో కుటుంబంతో వచ్చిచేరాను," అన్నాడు ఇంగ్లీషులో.

నేను అరవ్వాణ్ణని పొరపడ్డాడేమో అనుకుని, "చాలా సంతోషమండీ. మాకు తోడుగా ఉంటారు. మైలుదూరంలో ఎక్కడా తెలుగువాళ్లు లేరు," అన్నాను.

కాని ఆయన నా సంతోషాన్ని గమనించకుండా, ఇంకా ఇంగ్లీషులోనే మాట్లాడుతూ, "నాకు ఇద్దరో ముగ్గురో పనివాళ్లు కావాలి, సార్. మీరు కుదిర్చిపెట్టగలరా?" అని అడిగాడు.

"పనివాళ్లకేమండీ ఈ చుట్టుపక్కల చాలామంది పనిచేసుకు బతికేవాళ్లేనే," అన్నాను తెలుగులోనే.

ఆయనకష్టాలకు నేనే బాధ్యుణ్ణయి ఉండాలన్న అనుమానం సూచించే గొంతుపెట్టి, "యూ సీ, మా కుటుంబానికి నలుగురు పనివాళ్ళున్నా లేందీ జరగదు. కనీసం ఇద్దరుముగ్గురున్నా పెట్టుకుందామంటే వాళ్ళు నన్ను మింగెయ్యాలని చూస్తున్నారు. ఒకరికి మూడుపూట్లా భోజనాలుట! ఇంకొకరికి రెండు భోజనాలూ, రెండు కాఫీలూ కావాలిట! మరొకర్ని దొడ్లో పాకా వేసి ఉంచాలిట! ఇది కాక పదిరూపాయ లియ్యమనీ, ఏడు రూపాయ లియ్యమనీ అడుగుతున్నారు! ఇంత పచ్చికలి నే నెక్కడా చూడలేదు." అన్నాడాయన ఇంగ్లీషు గళగ్రాహిగా మాట్లాడుతూ.

"మీకు రోజల్లా పనిచేసేవాళ్లు కావాలా ఒకటి రెండు గంటలు పని చేసే వాళ్ళు కావాలా?" అన్నాను.

"మాపని ఒకటిరెండుగంటల్లో తెమిలేది కాదు, సార్. రోజల్లా ఇంట్లోనే ఉండాలి. ఒక పనిదాన్ని మాట్లాడితే అది పొద్దూకగానే మొగుడూ పిల్లలను చూసుకోబోతా నంటుంది. రాత్రి తొమ్మిదిదాకా అన్నా ఉండదుట!"

"మీరేం మిస్తామంటారు?"

"అన్నాలూ కాఫీలూ లేకుండా అయిదేసి రూపాయలిస్తా నన్నాను. రారుట! ఇటువంటి ఊరు నేనెక్కడా చూడలేదు," అన్నాడాయన.

లెక్క వేశాను. ఉదయం అయిదునుంచీ రాత్రి తొమ్మిదిదాకా పనిచేసినందుకు మనిషికి అయిదురూపాయ లిచ్చేటట్టయితే ఆ మనిషి ఏమి తిని బతకాలి?| ఏమీ తినీ బతకలేదు. ఆజీతానికి ఒప్పుకునే పనివాళ్ళు ఎక్కడన్నా ఉంటే వాళ్ళు ఆత్మహత్యకు ఒప్పుకున్నవాళ్ళన్నమాటే. అటువంటివాళ్ళే నాకూ రుకావాలి. నేనూ ఇంత కలవాణ్ణే. ఒకరిద్దరు పనిమనుషులను నేనూ పెట్టుకోగలను-వాళ్ళు ఆత్మహత్యకు సిద్ధపడితేనుమండీ!

"అయ్యా, మీ రే వూరునుంచీ వస్తున్నారు?" అన్నాను.

"ఏం?" అన్నాడాయన ఆశ్చర్యంగా.

"మరేం లేదు. నేను అవూళ్లో కాపురం పెడదామనీ! నాకు ఉద్యోగమే చెయ్యాలని లేదు. ఇన్నేళ్ళు నౌకరీచేస్తున్నానుగాని మా ఆవిడకు ఒక్క పనిమనిషిని పెట్టలేకపోయాను. మీరు ఉండివచ్చిన ఊరు వెళ్లితేనా ఈ జీవితకోర్కె సిద్ధించేటట్టు కనపడుతోంది! అన్నాను.

---

అమెరికన్ హైకమిషనర్ జాన్ జె మెక్లాయ్ ఒక ప్రకటన చేశాడు: జర్మనీ ఐక్యతా సాధనే తూర్పు జర్మనీకమ్యూనిస్టుపార్టీకి నిజంగా లక్ష్యమైనట్లయితే ఈ సమస్యపైనే జర్మనీఅంతటా, అనగా పశ్చిమజర్మనీలో కూడా, ఎన్నికలు జరపాలని సూచించాడు అయితే తూర్పు జర్మనీలో ఎన్నికల్లో పాల్గొనడానికి అన్ని రాజకీయపక్షాలకీ పూర్తి స్వేచ్ఛ నివ్వాలనీ, ఎన్నికల ప్రచారం జరుపుకోడానికి పోలీసుకట్టుడులను సడలించాలనీ షరతులు పెట్టాడు ఈ షరతులకూ, జనవాక్యనిర్ధారణకూ తూర్పుజర్మనీ అంగీకరించినట్లయితే, అక్టోబరులో పశ్చిమజర్మనీలో తిరిగి ఎన్నికలు జరపడానికి పశ్చిమజర్మనీప్రభుత్వం సమ్మతిస్తుందని పశ్చిమ జర్మనీప్రధాని అన్నాడు. కాని ఈవిషయమై తూర్పు జర్మనీప్రభుత్వం ఎట్టి సమాధానం ఇవ్వలేదు.

ఇది కేవలం ప్రచారంనిమిత్తం చేయబడిన ప్రతివాదనే కాని వాస్తవంగా పశ్చిమ జర్మనీలో ఇప్పుడు తిరిగి ఎన్నికలు జరపడానికి ఆంగ్లో-అమెరికన్ అధికారులు అంగీకరించేమాట సందేహం. పోగా ఫ్రెంచి-సార్ ఒడంబడికను రద్దుపరచాలని తూర్పు జర్మనీ నిర్బంధం విధించినట్లయితే ఫ్రాన్సు అంగీకరించడం అసంభవం. జర్మనీసమస్య ఈరీతిగా పరిష్కారం కావడం అసాధ్యం.

[సూర్యనారాయణ]

---



రష్యాలోని భారత రాయబారి డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణ ఐక్యరాజ్యసమితి సాంస్కృతికసంఘ సమావేశంలో పాల్గొనేందుకు పారిస్ వచ్చినపుడు అచటి భారత రాయబారి ఆయన గౌరవార్థం ఒక విందు ఏర్పాటు చేశారు.



భారతరిపబ్లిక్ అవతరణ మహోత్సవాన్ని పురస్కరించుకుని, వాషింగ్టన్‌లోని అమెరికన్ కాంగ్రెస్ గ్రంథాలయంవారు భారతదేశపు ప్రధానచరిత్ర పత్రాలప్రదర్శనం ఏర్పాటుచేశారు. భారత రాయబారవర్గ ప్రతినిధులు ప్రదర్శనాన్ని తిలకించుచున్నారు.

